# సృజన

95

ఆధునిక సాహిత్య వేదిక

మాస పత్రిక

సెప్టెంబర్ 1979

సాహిత్య విమర్శ :

"మార్క్సిజం - సాహిత్యం"

ఆర్ ఎస్ సుదర్శనం వక్రీకరణకు

త్రిపురనేని మధుసూదనరావు సమాధానం

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా 15 రూపాయలు

ఈ సంచిక రు. 1-50 పైసలు

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.


Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Warangal Printing Press, J.P.N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

సెప్టెంబర్ 1979 మాస పత్రిక 95



నిర్వహణ

'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా 15 రూపాయలు ఈ సంచిక రు. 1-50 పైసలు

# మధ్యంతర సిరి!

దేశ ప్రయోజనాల దృష్ట్యా ఉన్నతమైన ప్రజాస్వామ్య విలువలను గౌరవించి, రాజీనామా చేస్తున్న మొరార్జీదేశాయ్ సిఫారసు చేసినా సరే, లోక్‌సభను రద్దు చేయడానికి వీలులేదని ప్రతిపక్షాలు కోరాయి. దేశ ప్రయోజనాల దృష్ట్యా ఉన్నతమైన ప్రజాస్వామ్య విలువలను గౌరవిస్తూ చరణ్‌సింగ్ మంత్రివర్గం లోక్‌సభను రద్దు చేసి మధ్యంతర ఎన్నికలు నిర్వహించవలసిందిగా రాష్ట్రపతిని కోరింది.

దేశ ప్రయోజనాల దృష్ట్యా, ఉన్నతమైన ప్రజాస్వామ్య విలువలను కాపాడడానికి, రాజ్యాంగం యొక్క పవిత్రతను ఔన్నత్యాన్ని ప్రతిష్ఠించడానికి, తన అంతరాత్మ ప్రబోధం వల్ల రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డిగారు లోక్‌సభను రద్దుచేసి మధ్యంతర ఎన్నికలు ప్రకటించారు.

రాష్ట్రపతి చర్య దేశ ప్రయోజనాలకు, ప్రజాస్వామ్య విలువలకు తీవ్ర విఘాతమని జనతాపార్టీ నాయకులు ఖండిస్తున్నారు.

అందరి దృష్టిలోనూ అన్నిటికన్నా మిన్నగా వున్నవి దేశ ప్రయోజనాలు, ప్రజాస్వామ్య విలువలు. వీటికి నిర్వచనమూ, అన్వయమూ ఏమిటని ప్రశ్నిస్తే– లోక్‌సభ రద్దుకాకుండా వుండి, పెరుగుతున్న ధరలు, ప్రజా ప్రతినిధుల బాధ్యతల దృష్ట్యా లోక్‌సభ సభ్యుల జీతాలు పెరగాలని, ప్రజాసేవను గుర్తించడానికి కాల పరిమితి కొలమానం పెట్టకుండా ఒక్కసారి ఎన్నికయితే చాలు ఎప్పుడు సభ్యత్వం రద్దయినా జీవితాంతం పింఛను, తదితర ప్రివిలెజ్‌లు ఇవ్వాలని నిస్వార్థంగా చెప్తారు.

అయితే లోక్‌సభ సభ్యులుగా ఈ దేశ ప్రయోజనాలను కాపాడడం వాళ్ళ చేతులకు మించిన పనయిపోయింది. దేశ ప్రయోజనాల గురించి లోక్‌సభ సభ్యులకన్నా తీవ్రంగా ఆలోచించిన చరణ్‌సింగ్ మంత్రివర్గానికి ఆగస్టు 20న తన మంత్రివర్గం పడిపోవడంకన్నా లోక్‌సభ పడిపోవడం ఉన్నతోన్నతమైన ప్రజాస్వామిక చర్యగా కనిపించింది. తాను ప్రధానిగా కొన్ని నెలలు కొనసాగి తన ప్రభుత్వాధికారంలో మధ్యంతర ఎన్నికలు జరగడం ఆపద్ధర్మంగా ఆయనకు తోచింది.

అందరికన్నా దేశ ప్రయోజనాల గురించి, రాజ్యాంగంలోని ఉన్నతమైన విలువల గురించి అత్యంత వ్యగ్రతతో ఆలోచించే అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారిని రాజకీయోద్దేశాల వివాదాల్లోకి లాగడం ఆ పదవికి, ఆ 'హోదాను ఆయనకు కల్పించిన శ్రీ వెంకటేశ్వర స్వామికి' అపచారం చేయడమే. (హిదయతుల్లాగారికి ఉపాధ్యక్ష పదవి ప్రసాదించిన దేవునిదేమతమో!)

గాలి వాటం అనుకూలంగా వుండి వీలయితే పదవిని త్యజించి ఎన్నికల్లో పోటీ చేసి సంజీవరెడ్డిగారు ప్రధాని కావాలని కలలు కంటున్నారని అన్నది దేశప్రయోజనాలు గిట్టని వాళ్ళు అనేమాట. ఏ పార్టీకీ మెజారిటీరాదు, తాను శక్తివంతమైన రాష్ట్రపతిగా కొనసాగ దలచుకున్నాడు అన్నది కూడ ప్రజాస్వామ్యవిలువల పట్ల గౌరవం లేని వాళ్ళు అనేమాట.

హరిజనుడు ముఖ్యమంత్రి అయితే, ఎంతో సంతోషించిన పెద్దకులాల వాళ్ళ హరిజనుడు ప్రధాని కాకుండా అడ్డుపడ్డారనడం కూడ పెద్ద బుద్ధులు కలవాళ్ళు అనవలసిన మాటకాదు.

కాబట్టి దేశ ప్రయోజనాల దృష్ట్యా, ప్రజాస్వామ్య విలువల పరిరక్షణ కొరకు మధ్యంతర ఎన్నికలు అనివార్యమయ్యాయి. అత్యవసరమయ్యాయి.

ఎన్నికలు మధ్యంతరమయినవేకాని మారిన, మారుతున్న, నిలుస్తున్న, పడిపోతున్న పార్టీలు, విధేయతలు, అనుబంధాలు, పొత్తులు, మంత్రివర్గాల కన్న' ఎక్కువ కాలం, దాదాపు నాలుగు నెలల (ఇంకా ఎక్కువేనేమో) దీర్ఘకాలం 'స్థిరంగా నిలిచి బోర్ కొట్టేదిగా ఒక్క ఎన్నికల వాతావరణమే వున్నట్లున్నది.

ఒకచోట వరదలు, మరొకచోట కరువు, అంతటా అధిక ధరలు, నిత్యమూ అశాంతి, దేశవ్యాప్తంగా నిరాటంకంగా అమలవుతున్న పోలీసు రాజ్యము, అడుగడుగునా భయంకరంగా అణచబడుతున్న, చెరచబడుతున్న మానవ హక్కులు— పవిత్రమైన ఓటు హక్కును వినియోగించుకునే అరుదైన (తరుణైన!) అవకాశం కోసం నిరీక్షిస్తూ— వీటన్నంటినీ పట్టించుకోవడం, ఆలోచించడం, ఆందోళన చేయడం వాయిదా వేయడంకన్న మనం మాత్రం నిర్వహించవలసిన మహత్తర ప్రజాస్వామ్య కర్తవ్యమేమున్నది।

3-9-79 — సంపాదకుడు

---

## చెరబండరాజుకు మళ్ళా ఆపరేషన్

ప్రముఖ ప్రజాకవి, విరసం కార్యవర్గ సభ్యుడు చెరబండరాజుకు మళ్ళా బ్రెయిన్‌ట్యూమర్ ఆపరేషన్ జరగవలసి వున్నదని వైద్యులు అభిప్రాయపడుతున్నారు. ఎమర్జెన్సీ తొలగి జైలునుంచి విడుదలయిన తర్వాత ఆయనకు బ్రెయిన్‌ట్యూమర్ ఆపరేషన్ జరిగింది. అయితే ఇటీవల మళ్ళా ఆయన తీవ్రమైన అస్వస్థకు గురయినాడు.

## కంపూచియా...

ఎ. ఎన్.

విద్రోహాలు,
అన్నిటినీ సర్వనాశనంచేసి
కైవసం చేసుకున్నాక-
నిబ్బరంగా,
అమ్మలంతా, అక్కలంతా
పాత పోరాట రోజులను,
జ్ఞాపకం చేసుకుంటూ.....
కొత్త పోరాటాల గురించి
వంటపొయ్యి ముందు
దీర్ఘాలోచన చేస్తారు....
పిల్లలు తమ ఆటవస్తువుల ఎగిరేస్తూ
విముక్తి గీతాలు పాడుతారు-
నగరాలు తరిమేసిన యువకులు-
అడవుల దార్లన్ని శోధిస్తారు-
మళ్లీ మునుపటి రోజులే....
కాని ఈసారి వేసే అడుగుల్లో-
మరింత నిశ్చలత - మరింత అభివృద్ధి.
ఏ ప్రజా పోరాటము తాటాకులమంటకాదు
ఎంత చిన్న పరిమాణంలో ఉన్నా
సత్యం నివురు గప్పిన నిప్పే-
"కంపూచియా విప్లవం వర్ధిల్లాలి!!"
రష్యా అదే అంటుంది వియత్నాం
నాలుకతో....
కాని వాళ్లు ఆ మాటలవెనుక
అర్థం తెలుసుకున్నారు-
చిలుంపట్టిన, తుప్పుపట్టిన-
తుపాకులసీలలు - మరలు
బాగుచేసుకుంటూ కన్పిస్తారు.
వాళ్ల మందహాసాలవెనుక
సుదీర్ఘపోరాట మార్గంఉంది.
వాళ్లు జయిస్తారు....
నయా రివిజనిజంమీద,
సామ్రాజ్యవాదంమీద
కంపూచియా జయిస్తుంది.
వాళ్లు ఒంటరిగాలేరు.
ప్రపంచం వాళ్ల వెనుకవుంది.
మళ్లీ మళ్లీ పోరాడుతారు-
మళ్లీ మళ్లీ గెలుస్తారు....

---

**STOP PRESS** వరంగల్ బంద్ **4-9-79**

లాల్‌బహదూర్ కళాశాలలో విద్యార్థులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు, ప్రిన్సిపల్‌పై పోలీసుల లాఠీచార్జికి నిరసనగా, కలెక్టరాఫీసులో విద్యార్థులపై లాఠీచార్జికి నిరసనగా విద్యార్థి కార్యాచరణ సమితి 'వరంగల్ బంద్'కు యిచ్చిన పిలుపు స్వచ్ఛందంగా విజయవంతమైంది.

పోలీసుల అత్యాచారాలను ప్రజాస్వామ్య విద్యార్థిసంస్థ, కాకతీయ యునివర్సిటీ ఎన్జీవోల సంఘం, రీజినల్ ఇంజనీరింగ్ కాలేజ్ సిబ్బందిసంఘ కార్యవర్గం, ఆర్ట్స్, సైన్స్ కళాశాల అధ్యాపకేతర సిబ్బంది సంఘం, జిల్లాకాంగ్రెస్ అధ్యక్షుడు కూడ ఖండించారు.

చౌ లి-పో
ఇంగ్లీషు నుంచి తెలుగు
నళిని



# ఉప్పెన

రెండవ భాగం

## 2

ఊరు వూరంతా సియావోని చూసేందు కొచ్చింది. తెల తెలవారు తూండగానే రైతు సంఘం ఆవరణలో జనం కిక్కిరిసి పోయేరు. సియావో ఎప్పుడు కనిపిస్తాడా అని అందరూ ఎదురుచూస్తున్నారు. ఓల్డ్‌సన్, చాంగ్ చింగ్-షీ ఉత్తరాన వున్న గదికేసి దారి తీసేరు. చాంగ్ చింగ్-షీ పద్దెనిమిదేళ్ళవాడు, మంచి ఒడ్డూ పొడవూను. సైన్యంలో చేరిన చాంగ్ చింగ్- సియాంగ్ తమ్ముడు. ఇద్దరి పాటు ఒక్కడే పడగల బలశాలి. 'ఆర్మీ డిపెండెంట్' * అయినా అతను అదనపు సౌకర్యాలు నిరాకరించేడు. తన పొలం స్వంతంగా సాగుచేసి ఆ ఏడాది మంచి పొలమనిపించుకున్నాడు. మొక్కజొన్న కంకి ఒక్కొక్కటి దాదాపు అడుగు పొడవుంది. గింజలు బాగా వూరేయి. తోలు టోపి పెట్టుకొని సియావో గదిలో కొచ్చేడు.

"ఇంకా నేవనేదు" అంటూ సియావోని లేపబోయేడు.

"ఆగాగు. కుసింతసేపు తొంగుండనీ. పొద్దుట నిద్దరలో మజా నీకేటి తెల్సు! కొత్తపెల్లం నాగా, అర కోడికూర నాగా వుంటాది" అన్నాడు ఓల్డ్‌సన్ అతన్ని వారిస్తూ।

"ఏమిటి 'పెళ్ళాం', 'కోడి' అంటున్నారు?" అంటూ సియావో లేచేడు. దుప్పటిలోంచే కోటు తొడుక్కున్నాడు. ఇంతలో జనం కాంగ్ వరకు తోసుకొచ్చేసేరు.

---

* కుటుంబంలో ఏ ఒక్కరు సైన్యంలో వున్నాగాని ప్రభుత్వం ఆ కుటుంబానికి అదనపు సౌకర్యాలిస్తుంది.

సియావోలేచి పక్కకి తిరిగి పూలు పేంటు వేసుకున్నాడు. అన్నీ తెలిసిన ముఖాలే కన్పించేయి. ఎవరినీ ప్రత్యేకంగా పలకరించాల్సిన అవసరం లేదనుకున్నాడు. కాంగ్ అంచున కూర్చుని జోళ్ళు తొడుక్కుంటూ ఓల్డ్‌సన్‌ని చూసి

"ఇంకా బతికే వున్నావేఁవిటయ్యా!" అని సరదాగా అన్నాడు.

"నామగాని సచ్చిపోతే మా ఆడదాయి నిన్ను సూడను జిల్లా కేంద్రానికి వచ్చీసేది కాదా?" అన్నాడు ఓల్డ్‌సన్ మామూలుగా ఎడంకన్ను చికిలిస్తూ. జోళ్ళు తొడుక్కుంటూ ఓల్డ్‌సన్‌తో ఇంకా సరదాగా మాట్లాడేడు సియావో. చావో భార్య కూడా మాటకలిపింది.

"నువ్వొచ్చేవని తెలిసి మా 'వు' ఎగిరిగంతేసేడు"

అందరూ ఒక్కసారిగా మాట్లాడుతూ సియావోరాకకోసం ఎంతగా ఎదురు చూసేరో చెప్పేరు.

"మొక్కజొన్న పండగ ముందునుంచే నీకోసం సూసేం"

"సంద్రిడి కోసరం సూసేం, సుక్కల కోసరం సూసేం, నీ కోసరం సూసేం- కానీ నువ్ రాలేదు. ఇక్కన్నించి ఎలిపోగానే మాఁవు యాదస్తు లేఁవేటి బాబూ?"

"ఛ ఛ మిమ్మల్ని ఎప్పటికీ మర్చిపోను" అన్నాడు సియావో నవ్వుతూ.

జోళ్ళుతొడుక్కొని, నీళ్ళకోసం డేక్సా తీసుకుని బైటిగదిలోకి వెళ్ళేడు. ఇంతలో తలుపుకి ఆనుకుని నించున్న పాయిభార్య కత్తిరించుకున్న జుట్టుతో కనిపించింది. మెరుస్తున్న కళ్ళతో ఏదో మాట్లాడానికి తహ తహ లాడుతున్నట్టనిపించి తనే పలకరించేడు.

"ఎలావున్నావు? పాయి షువాంగ్‌చెంగ్ పబ్లిక్‌సెక్యూరిటీ ఆఫీసులో బావున్నాడు. మిమ్మల్ని తలుస్తూంటాడు."

"ఆడు నన్ను తల్సుకోడఁవేటి? నాకు తెల్దేటిబాబూ నన్నేనాడో మర్సిపోనాడు-" అంది పాయిభార్య పళ్ళబిగువున.

సియావో నవ్వి ఏదో చెప్పబోయేటంతలో బైట బండి చప్పుడు వినిపించింది. అందరితోపాటు అతనూ బైటికెళ్ళేడు. తీన్‌తాత బండెడు కట్టెలు తోలుకొచ్చేడు, ఉత్తరపువేషకొచ్చి బండి ఆపి కొరడా కింద పెట్టి లోపలికొస్తూ సియావోని పలకరించేడు.

"నీకు పుల్లలు పడతయ్యని బండి తోలుకొచ్చేసినాను. ఇయ్యి ఆకరువయి పోంగానే మల్ల తోలుకొత్తా. ఈ వూల్ల ఏటున్నా లేకున్నా పుల్లలు సమురుద్దిగా వుంతాయి."

మరునిమిషంలో జనం బండిచుట్టూ మూగి కట్టెలన్నీ దింపేసేరు. గోడకి ఆనించి ఒకదానిమీదొకటి పేర్చేరు. వెంటనే వాటిమీద మంచు కప్పేసింది.

గదిలో పొయ్యికూడా కట్టెలతో అంటించేరు. అందరూ వెచ్చగావున్న గదుల్లో చేరి భోజనాలకక్కూడా వెళ్ళకుండా వుండిపోయేరు. గదిలో కాంగ్ మీద, బల్లమీద-ఎటుచూసినా జనమే. కొందరు వంతుల వారీగా సియావోకోటు తొడుక్కు చూస్తున్నారు. కొందరు అతని తుపాకి అటు యిటు తిప్పుతున్నారు. ఓల్డ్‌సన్ కూడా అక్కడే తచ్చాడుతున్నాడు. కొత్త తుపాకి చూస్తూ

"ఈ తుపాకి సూసినారా ? ఇది దేవుడి పుస్తకం[1] లోదే" అన్నాడు.

"ఏటి నీ మాటలు, ఇంకా 'దేవుడు' 'దెయ్యం' అంటావేటి ? ఇది మనిసి సేసిన తుపాకి" అన్నాడు చాంగ్ చింగ్-షీ.

"ఏటి, దేవుడి పుస్తకం లేదంతావేటి ? చూక్ లియాంగ్[2] ఆ పుస్తకం లోంచి కాదేటి తూరుపు గాలిని పిలిసింది ? ఇంకా సెప్పమంటావా ? సేతింగ్-షాన్ ఆడదాయి ఫాన్‌లీ-హువా[3] కొండని పైకెత్తి సంద్రాన్ని ఎనక్కి తిప్పేసినాదికాదా ?"

---

1. Book of Heaven
2. చూక్-లియాంగ్ (181-234 క్రీ.శ). 3 రాజ్యాలకాలంలో షూ రాష్ట్రానికి అతను ప్రధాని. యుద్ధవ్యూహాలు పన్నడంలోను, జ్యోతి శ్శాస్త్రంలోను దిట్ట. '3 రాజ్యాలగాథ' అనే నవలలో ఇతను నీరు, గాలి, నిప్పులాంటి పంచ భూతాలమీద అధికారంగల వ్యక్తిగా వర్ణించబడ్డాడు. ఓసారి ఇతను తూర్పు పవనాన్నిపిల్చి శత్రువుని అగ్నితో భయపెట్టినట్లు ప్రతీతి,
3. 'పాశ్చాత్యులదాడి' అన్న నవలలో సే తింగ్-షాన్, షాన్‌లీ-హువా నాయకా నాయికలు. కథాంశం- తాంగ్ తాయి- తుంగ్ అనే రాజు పడమటి చైనాలోని పాశ్చాత్య తండాల మీద యుద్ధం ప్రకటించడం. అతని పరిపాలనా కాలం 627-649 క్రీ.శ. అతని సేనాధిపతి సే తింగ్-షాన్ భార్య ఫాన్‌లీ-హువా సాహసవంతురాలిగా, పర్వతాన్ని కదిలించి, సముద్రాన్ని వెనక్కి తిప్పగల ధీశాలిగా ఆ నవలలో వర్ణించబడింది.

ఓల్డ్‌సన్‌తో వాదించలేక చాంగ్ చింగ్-షి అతన్ని పట్టించుకోవడం మానీసి బల్లమీద పుస్తకాలు చూడసాగేడు. అతను 'సంక్షిప్త వ్యవసాయ చట్టం' తీయగానే దాన్ని చూపుతూ సియావో ఓల్డ్‌సన్‌కి సమాధానమిచ్చేడు.

"దేఁవుడి పుస్తకంకన్నా ఈ మనుషుల పుస్తకం నయం. చైర్మన్ మావో చెప్పిన భూఁవి పంపక సూత్రాల గురించి రాసింది, ఇది చదివితే తప్పకుండా మన బతుకులు బాగుచేసుకోగలం. కొత్తగా వచ్చిన యీ భూపంపక చట్టం ప్రకారం యీసారి భూఁవి పంపకం ఇంకా పకడ్బందీగా సాగాలి- ఈసారితో భూస్వామ్యం ఖతం: మనం ఎంత బాగా పనిచేస్తే అంత గట్టిగా నిలబడగలం. మీరింత వరకు బాగా పనిచేసేరా?" అని సియావో అడిగేడు.

ఈ ప్రశ్నతో మళ్ళీ అందరూ ఒక్కసారి మాట్లాడసాగేరు. కొందరు గొణిగేరు, మరి కొందరు నవ్వేరు, ఇంకొందరు తిట్టేరు. ఎవరు ఏఁవి మాట్లాడు తున్నారో తెలియరాలేదు. కొంతసద్దు మణిగేక తీన్ తాత,

"ఈ వూల్ల ఎదవలంతా మీద కెక్కేసినారు బాబూ. ఆల్లే తెగతిని బలిసి పోనారు. ఇంతకాలం కాఁవందులకి పొలందున్నేం ఇప్పుడీ దగుల్బాజీల కోసరం రెక్క లిరిసీసుకుంతన్నాం" అన్నాడు.

ఓల్డ్‌సన్ అందుకున్నాడు

"ఇంతకాలం కట్టపడి కుందేల్నిపట్టి ఈ గెద్దల కేసీసినాం"

చాంగ్ చింగ్-షీ కూడా మాట్లాడేడు.

"అసలేటి మారినాది? కిందటేడు నాకో గుడ్డ ముక్కొచ్చినాది. అడివిలో కట్టెలు కొట్టీ కొట్టీ అది సినిగిపోనాది. మంచు కురుత్తున్నాదిగాని ఆర్మీ డిపెండెంట్లకి ఓ సలికోటన్నానేదు. మరి కాఁవందుల్ని సూడండి – పొడవాటిగొన్లు తొడుక్కొని సలికోట్లేసుకోని కులుకుతుండారు".

"కాఁవందులు ఇంకా కౌలుకిస్తున్నారా?" అని అడిగేడు సియావో

"మరేటి? ఆలు బీడడిపోయిన బూఁవేదో ఇచ్చేసినారుగాని ఆల్లకాడ బంగారం పండే బూఁవున్నాది. ఆలు అటు యిటు తిరగాల్సిన పన్లేదు బాబూ. అంతా కౌలు కిచ్చేత్తుండారు" అన్నాడు తీన్ తాత.

"నువ్వేటో బూఁవి గురించే సెప్తండావుగాని సియావోబాబుగాని రాకపోతే ఆలు ఇచ్చిన ఇల్లన్నీ నొల్లుకునేటోళ్ళు కాదా?" అంది పాయి భార్య.

తీన్‌తాత గుడ్డిభార్య నెమ్మదిగా కర్రిసాయంతో ముందుకొచ్చి

"నిజఁవే బాబూ. మొన్ననే హాన్ ఉంపుడుకత్తె వచ్చి ఏటన్నాదో ఎరికేనా? ఇంటి మీద ఎర్రిపూవ్వు పూసినాదట, బైట సెట్టేమో తెల్లపూలు పూత్తున్నాదట. అలా పూయడం హాన్ ఇంటోల్లకిమంచిదట. ఆల్లు ఏరోజేనా వచ్చేత్తారట. అందుకే ఇల్లంతా మళాగత్తు సేసుంచమంది" అన్నది.

చాంగ్ చింగ్-షీ అడ్డొచ్చి

"అంతా బూటకం, అదేటీ నమ్మకు. ఎక్కడన్నా ఇంటి మీద పువ్వు పూస్తాదేటి? ఆ సెట్టు మాత్రిం తెల్లపూలు పూసినాదా?" అన్నాడు.

"ఆ సెట్టు తెల్లపూలు పూయడం నాను సూళ్లేదు." అన్నాడు ఓల్డుసన్. "ఇంటి మీద ఎర్రిపువ్వయ్‌తే నానూ సూసేను. కువాంగ్-సూ రాజుండగా తాంగ్ ఇంటి మీద నానా పువ్వు సూసేను" అన్నాడు.

సియావో కొంచెం ఆలోచించి "అందులో ఆశ్చర్యం ఏఁవీలేదే! ఇంటికప్పు మీద గాలికి ఏ గింజో ఎగిరి పడుంటుంది. అదే పూసేకాలంలో పూసివుంటుంది" అన్నాడు.

తీన్‌తాత భార్యవైపు తిరిగి "మీకు కిందటేడు ఇచ్చిన ఇల్లు ఎందుకు మారి పోయేరు?" అని అడిగేడు.

"బైటకి తోసీసేరు" అని ఓల్డుసన్ సమాధాన మిచ్చేడు.

"ఎవరికన్ని దమ్ములు?"

"ఇప్పుడు ఏలుతున్నోల్లకే!"

ఎవరినుద్దేశించి ఇలా అన్నారో సియావోకి అర్థమైంది. తర్వాత దుష్ట త్రయంలోని 'తు', 'తాంగ్' ఏమయేరని అడిగేడు సియావో. వాళ్ళ భూఁవంతా పంచేరా లేదా అన్న ప్రశ్నకి కొందరు అవుననీ కొందరు కాదనీ సమాధానమిచ్చేరు. తీన్‌తాత కాంగ్ మీద కూర్చుని పైపు వెలిగించుకుంటూ

"ఆడు సైర్మన్ అయినకాన్నించి యీ పూల్ల కానా జరిగిపోనాది. ఆడు కాఁవందుల మనిసిగాని మా మనిసికాదు బాబూ. కాఁవందుల్ని బెదిరించీసినట్టు నాటకఁవాడి చిన్నమొత్తాలు తీసుకోని ఆలని ఒగ్గేసినాడు. మద్దె తరగతి రైతులకేమో రాచ్చసుడైనాడు. లియూ-తె-షాన్ మద్దె తరగతి రైతే. ఆడు పైచర్లు మోయను సైన్నెంలోకి పోతే ఈఁడు ఆనిదంతా నొల్లుకుపోనాడు, ఎదవనాయాల" అని చెప్పేడు.

"చైర్మన్ చాంగ్ ఎలాంటి రైతు?" అని అడిగేడు సియావో.

"ఆడు రైతేటి? ఉత్త తిరుగుమోతు."

"తిరుగుమోతుకన్నా కనీకట్టం"

"అయితే అతన్ని చైర్మన్‌గా ఎందుకు ఎన్నుకున్నారు?" అని రెట్టించేడు సియావో.

"'సీ' ఇల్లు తనికీ సేసిన్నాడు కానా గట్టిగా నిలబడ్డాడు బాబూ"

"ఏం చేసేడు?"

"రెండు బంగారపు ఉంగరాలు, ఆరు బట్టల మూటలు పైకి లాగేడు"

"అయితే మొదట్లో జోరుగానే వుండే వాడన్నమాట. మరిప్పుడు ఎందుకిలా దిగజారి పోయేడు?"

రకరకాలుగా వివరించేరు: జనాన్ని మభ్య పెట్టేందుకు నాటకం ఆడేడని, లీకీ-యంగ్ అతన్ని తప్పుదారి పట్టించేడని, అతను మొదట్లో 'టక్కరి చాంగ్'గా పేరు పొందిన దివాలా తీసిన భూకామంద సీను.

అంతవరకు నోరు మెదపని ఓల్డ్‌సన్ "నానుముందే సెప్పేనా? నానేటి సెప్పేను? 'ఆడు దొంగ నా కొడుకు. ఆన్ని ఎన్నుకోకండి' అని అందరి సెవుల్లో ఇల్లుకట్టుకుపోరేను. ఎవలూ నా మాట నెక్కసెయ్యనేదే." అని చెప్పేడు.

"ఎప్పుడయ్యా నువ్వామాట సెప్పింది? ఆడు నిన్నుతాపు తన్నడమే యాద స్తున్నాదినాకు" అని దెబ్బతీసేడు చాంగ్ చింగ్-షీ.

అది బయట పడకుండా వుండేందుకు ఓల్డ్‌సన్ నానా తిప్పలు పడ్డాడు. సిగ్గు చేటని ఆ విషయం అతను పెళ్ళానిక్కూడ చెప్పుకోలేదు. ఇప్పుడీ కుర్రకుంక అందరి ముందు బైటపెట్టేసేడు. ముసలివాడి మీదినా పీళ్ళజోరు? అయినా ఓల్డుసన్ తన సహజ ధోరణిలో, ఇవేవీ పట్టనట్టు చెప్పుకుపోయేడు.

"ఆడు మంచికి మారేడని, తిరుగుమోతుకాడనీ మీరందరు అన్నారుగదా, అప్పుడు నేనేటన్నాను? 'నేదు నేదు, ఆడు ఏనాటికీ మంచోడు కాడు. నా మాట ఇనుకోకపోతే మీరే దెబ్బతింతారు' అన్నాను. 'కుందేలుకి పగ్గంవెయ్యావేం' అన్న సాంవెత వూరకే వచ్చినాదేటి?"

"ఆ సాంవెత ఎక్కడ పట్టేవు తాతా? నువ్వేతయారు సేసినావేటి?" అనిఅడిగేడు చాంగ్ చింగ్-షీ

"అదు కుందేలుకాదేటి? అదు కుందేలొక్కటేకాదు- సుంచెలక కూడాను."

"అతను దుంచెలుకయితేమరి కన్నం ఎక్కడుంది?" అని సియావో సవ్వుతాలుగా అడిగేడు.

ఎడంకన్ను చికిలిస్తూ ఓల్డుసన్ "ఈ వూరంతా ఒక్కతాటి మీద నిలవనేదు కదా! ఎవులింటో అలు తొంగుడుంతారు. ఈ సిన్న కిటుకులోనే ఆడి బొక్కవున్నాది" అన్నాడు.

అంగీకారంగా సియావో తలూపేడు. ఓల్డుసన్ చెప్పింది సబబే. అందుకే ఆ వూరు దెబ్బతిన్నది.

"కువో చువాన్-హై ఏడి?"

"సీకింకా కువో యాదస్తున్నాదేటిబాబూ? అతని తలరాత అలాగుంది. రైతు సంగం ఒగ్గీసి సిన్నసిన్న పనులు సేసుకుంతన్నాడు" అని చెప్పేడు ఓల్డుసన్.

"నిన్న నాకవుపించేడు. ఎవులికోసవో కట్టెలు కొట్టుకురాను కొండ మీదికి పోతుండాడు" అన్నాడు తీన్‌తాత.

ఇంకాసేపు ఇలాగే మాట్లాడుకున్నాక భోజనం వేదాటి పోవడంవల్ల అందరూ లేచేరు! సియావో తమ తరఫునే వుండడంవల్ల ఇక చాంగ్‌ఫూ-యింగ్‌కీ, లీ కీ-యంగ్‌కీ జడవాల్సిన అవసరంలేదని నమ్మి తేల్గ్గా అడుగులు వేసుకుంటూ సాగిపోయేరందరూ.

## 3

భోజనాలయిపోయేక సియావో దళ సభ్యుల్ని సమావేశపర్చేడు.

వాన్ తప్ప అందరూ ఆ వూరికి కొత్త. ఇంతకు ముందున్న కార్యకర్త లందరూ దక్షిణ మంచూరియాలో పని మొదలెట్టేందుకు వెళ్ళిపోయేరు. వారితో చిన్న వాంగ్, లియూ-షెంగీ కూడా వెళ్ళేరు. ఈ మారొచ్చిన పదహారు మంది దళ సభ్యులు కూడ యువకులే. క్రిందటి సంవత్సరం వీళ్ళంతా వేర్వేరు ప్రాంతాల్లో భూసంస్కరణ కార్యక్రమాలు నిర్వహించేరు. వాళ్ళు మొదట విద్యావంతులు కాకపోయినా ఇప్పు డిప్పుడే చదువుతోపాటు అన్నీ నేర్చుకుంటున్నారు. భూసంస్కరణ ఉద్యమంలో వర్గపోరాటం గురించి బాగా తెల్సినవాళ్ళు కావడంతో యీ దళస్థాయి వున్నతమైంది.

భూసంస్కరణ చట్టాన్ని పరిశీలించేందుకు జిల్లాకేంద్రంలో జరిగిన అయిదు రోజుల సమావేశంలో సియావోతో యీ దళ సభ్యులందరూ పాల్గొన్నారు. ఇవేళ్టి సమా

వేశంలో ఇక్కడ పని ఎలాసాగించాలి, గ్రామస్తులతో ఎలా మెలగాలి అనే అంశాలు చర్చించేరు. అధ్యక్షత వహించిన సియావో తాను చెప్పవలసినవి చెప్పి, పాత స్నేహితులను కలసి యువాన్ మావో పరిస్థితులు అర్థం చేసుకునేందుకు వెళ్ళిపోయేడు. మంచినీళ్ళుతాగి, రోడ్డు మీదకు నడిచేడు. దళసభ్యులే సమావేశం నిర్వహించేరు.

కొద్దిగా మంచు కురుస్తోంది, చల్లగాలి రివ్వున వీస్తోంది. సియావో టోపి చెవులమీదకు దించుకున్నాడు. యువాన్ మావో రక్షణ కోసం ప్రాణాలర్పించిన అమరజీవి చావో భార్యని మొదట చూడాలనిపించి ఆమె దక్షిణ వీధిలో వుంటోందని గుర్తొచ్చి అటునడిచేడు. ఇంతలో ఎవరో ఆమె ఉత్తరపువేపు వుంటోందని చెప్పగా అటుకేసి సాగేడు సియావో. చావో భార్య 'లీ' అనే విధవరాలితో కలిసి వుంటోంది. ఇద్దరికీ చెరొక కాంగు వుంది. సియావో గదిలో అడుగుపెట్టగానే చావో కొడుకు సో-చు కాంగు మీంచిదూకి అతని కాళ్ళకుచుట్టుకుపోయి "మాఁవయ్యా ! మాఁవయ్యా !" అని గట్టిగా అరవసాగేడు. అరుస్తూ సియావో చెయ్యిపట్టుకుని పట్టికాళ్ళతో పైకి ఎగరాక సాగేడు. అదిచూసి చావో భార్య

"ఒరేయ్, మాఁవయ్య బట్టలు తొక్కేవేటి ? దిగుతావా ? కొట్టేదా ?" అని గదమాయించింది.

తల్లి ఎలాగూకొట్టదని తెలిసి సియావో మెడ కావిలించుకున్నాడు సో-చు. సియావో కూడ అతన్ని హత్తుకుని ముద్దాడి, కాంగు మీదకుదింపి తానుకూడ కాంగు అంచున కూర్చున్నాడు. చాప అల్లుతూ కూర్చున్న చావో భార్య అతన్ని చూడగానే అయిన వాళ్ళు ఒచ్చినంత సంబరపడింది. పక్కావిడని పైపు, పుగాకు అడిగి పైపువెలిగించి సియావో కిచ్చింది. పొగలదులుతూ, బల్లమీద చిరిగిపోయిన దుప్పటిచూస్తూ పరామర్శించేడు

"ఎలా వుంటున్నారమ్మా మీరు ?" అని.

"అంతా బాగానే వున్నాది బాబూ. మంచుకో రోజుల్లో పొయ్యిమీన పిల్లి నెగడం గగనం. అప్పుడెనాగ బతికినాఁవో- మరిప్పుడు బాగున్నాది. ఈ గుంటడికి ఏటన్నా కావాలంతే సాపలల్లి పైసలెత్తా"నంది చావో భార్య.

"మరి 'వాళ్ళు' మీకు సాయంచేస్తారా ?" అనడిగాడు సియావో.

చావో భార్య చరుక్కునలేచి "ఎవలు ? రైతు సంగపోల్లా ? ఆల్లేటి, సాయవేఁటి ఆల్లకి మాఁవు కనపడతాఁవా ?" అంది.

"పండుగలకి ఏఁవీ సరుకులేనా ఇవ్వరా ?" అని అడిగేడు సియావో.

ఆమెనవ్వి వూరుకుంది. తన భర్త ఇతరుల కోసం తన సొంతం అనేది సొంతం వదిలేశాడన్న సంగతి ఆమె ఎన్నటికీ మర్చిపోలేదు పైగా సహజంగా ఎవర్నీ తప్పు పట్టే స్వభావం కాదామెది. కాని ఆవిడతో వుండే 'లీ' యిది సహించలేక, చావో భార్య తరవున తనే మాట్లాడింది :

"ఏటిత్తారు బాబు ఆల్లు ? 'చిన్నమీ' ఒక్కతెకే సరుకులన్నీ ముడతాయి. ఆర్మీ డిపెండెంటోల్లని సూడ్డం ఆలేనాడో మానుకున్నారు."

"మీకు నీళ్ళెవరైనా తెచ్చి పెడుతున్నారా ?"

"కువో సైర్మన్‌గా ఉన్నంతకాలం అతనే నీలు తెచ్చీవోడు. వూర్ల వుంతే ఇప్పుడైనా అంతే. అతనే పుల్లలు కొట్టిపెడతాడు. అతను లేనప్పుడేటి సేత్తాంబాబూ– మాఁవే నీలు తెచ్చుకుంతం. అది పర్నేదుగాని బాబూ, టోపీల్నేవుకదా, తిరిగొచ్చీతలికి సలికి సెవులు బిగుసుకుపోతాయి" అంది లీ.

"పందుల కాపరి మీతోపాటే వుంటున్నాడుకదా, అతన్ని ఎందుకు సాయఁవడగరు ?" అని అడిగేడు సియావో.

"ఈ యమ్మ మనుసు ఎన్నలాంటిది బాబూ. ఆ 'వూ'ని శానా ఇదిగా సూసు కుంతాది. బరువు పనులుసేసి ఆడు సోలిపోతాడని ఏ పనీ సెప్పదు. అన్ని బల్లోకి పంపినాది. ఈ యమ్మలాటోల్లెందరో వుండరు బాబూ. సొంఁత కొడుక్కి జోలు నేవుగాని ఆ పందుల కాపరికి జోలు కుట్టిచ్చినాది" అని 'లీ' జవాబు చెప్పింది.

తలొంచుకొని నిశ్శబ్దంగా పనిచేసుకుంటూ కూర్చుండి పోయింది చావో భార్య. ఆమెకు సరైన తిండి లేదనడానికి తార్కాణం ఎండిపోయిన ఆమె రాగిజుట్టే. అది గమనించేడు సియావో. ఆమె నిజమైన కష్టజీవులబిడ్డ. తన బీదరికాన్ని మరచి ఇతరుల కోసం పాటుబడే కష్టజీవి. తన కొడుకుకన్నాకూడ, 'నా' అనే వాళ్ళెవరులేని పందులకాపరిని ఏలోటు రాకుండా చూసుకుంటోంది. మిగిలిన పల్లెపడుచులలాగే చాపలు బుట్టలు అల్లుతూ కాలంగడుపుతోంది. రైతుసంఘం ఛైర్మన్ చాంగ్ వూ-యింగ్‌కాని, మహిళా సంఘం ఛైర్మన్ చిన్నమీ గాని ఆడవాళ్ళని కూడ గట్టలేక పోయేరు. ఈ పల్లెపడుచులు మామూలు బుట్టలు, చాపలు అల్లడంతోనే సరిపెట్టుకుంటున్నారు.

ఏదో సందర్భంలో చావో మాటవస్తే ఆవిడ బాధపడుతుందని, సియావో అక్కడ ఎక్కువసేపు వుండదలుచుకోలేదు. అతడు వెళ్ళిపోతూండగా గేటుబయట ఓ కుర్రాడు చేతిలో పుస్తకాల సంచితో కనిపించేడు. అతను వెచ్చనిబట్టలు తొడుక్కున్నాడు. సియావో అతన్ని పలకరించి అప్రయత్నంగా కాళ్ళవంకచూసేడు - అతనికాళ్ళకి అందమైన వెచ్చని జోళ్ళున్నాయి. అతనే వూ చియా - వూ, పందులకాపరి.

పందులకాపరి జోళ్ళు చూస్తుంటే సో - చూ మురికికాళ్ళు గుర్తొచ్చేయి సియావోకి. "నిజంవే, చావో భార్యలాంటివాళ్ళు నూటికి కోటికి ఒకరుంటారు. పరులకోసం తాను బలయిపోతుంది. కామ్రేడ్ చావోకి తగిన భార్య" అనుకున్నాడు సియావో. వూని "నువ్వు స్కూల్లో ఏంవి చదువుతావు ? నీ టీచర్లు ఎలా వుంటారు ?" అని అడిగి జవాబులు సంతృప్తి కరంగా వుండడంతో ముందుకు సాగేడు సియావో. ఆ కుర్రాడు ఇంట్లోకి పరుగెత్తేడు. చావో ఇంట్లోంచి నవ్వులు, మధ్యలో సో - చు

కేరింతలు వినిపించేయి.

సియావో తూర్పువేపు మలుపుతిరిగి పాయి యింటివేపు సాగేడు. పాయి తన భార్యకి ఓ ఉత్తరం పంపేడు. ఆపుదయం జనంసందట్లో ఆసంగతే మర్చిపోయేడు సియావో. ఇప్పుడది తీసుకొచ్చేడు.

పాయిభార్య కాంగుమీద కూర్చుని చాపలు అల్లుతోంది. అందులో ఆమెది అందెవేసినచెయ్యి. మునుపు బొనకడుపు కూటికోసం అల్లినపుడు ఆషామాషీగా అల్లేది. కాని ఇప్పుడివి తమ ప్రభుత్వం కోసంకాబట్టి మనసుపెట్టి చక్కగా అల్లుతోంది. ఆమెఅల్లిన చాపలు. బుట్టలు ఎంతోబాగున్నాయి. ఆమెభర్త గవర్నమెంట్ వర్కర్ అయినప్పటినించి గవర్నమెంటు పనులు ఆమెచాలా బాగాచేస్తోంది. ఆపనులన్నీ *దళ పోళ్ళ కోసమేగా, మరి తనభర్తకూడా దళపోడేనాయె !

ప్రభుత్వ పనులమీద పైవూళ్ళు పోయిన భర్తలగురించే తలపోస్తూ పనులు చేసుకుంటారు భార్యలు. పాయిభార్యకూడ అంతే. తానెంత బెంగపడినా బైటపడేది కాదు.

"ఏంవమ్మా నీమొగుడికోసం బెంగటిల్లి పోనావేటి?" అని ఎవరైనా అడిగితే "నానా, ఎందుకూ?" అనేది.

కానిఎప్పుడూ భర్తగురించిని తలపులే అతనీవేళప్పుడు ఏంవి చేస్తూంటాడు ? రోజంతా పనివుంటుందా ? అతనిబట్టలు, మేజోళ్ళు చినిగితే ఎవరుబాగుచేస్తారు.

*Eighth Route Army

ముసలిదా, పడుచుపిల్లా, అందమైన పడుచుపిల్లా? ఆలోచన యిక్కడికొచ్చేసరికి మనసు అసూయతో భుగభుగలాడి అల్లుతున్న వెదురుపుల్ల గట్టిగా లాగింది. వేలుతెగి, నెత్తురు చిమ్మింది. వెంటనే గుడ్డముక్కతో కట్టు కట్టుకుంది. గుడ్డ యింతలోనే ఎరుపెక్కింది. మళ్ళీ పనిమొదలెట్టింది- తిట్టుకుంటూ.

"సిజిమ్మదియ్య! ఎల్లినకాన్నించి ఒక్కపుత్తరంముక్కైనా రాసినావుకావు. ఇంతలోనే నన్నుమర్సినావేటో!" అనుకుంటూ.

ఇంతలో వీధిలో కుక్కమొరిగింది. సియావో వచ్చేడు! కొంగుదిగి అతనికి ఎదురువెళ్ళి తలుపు తీయగానే చల్లగాలి ముఖంమీదికి కొట్టింది.

"రా బాబూరా! ఇంతసలిగున్నాదేటి! బేగి లోనికిరాబాబూ"

మంచుకురుస్తోంది. గాలిహోరుకూడా పెరిగింది. గదిలోమాత్రం వెచ్చగావుంది. గడ్డకట్టిన సియావోచేతులు వెచ్చబడ్డాయి. పాయి భార్యదగ్గర పైపుఅందుకున్నాడు. సియావో వూళ్ళో విషయాలగురించి ప్రస్తావిస్తే పాయి భార్య మాటమార్చబోయింది. "షువాంగ్‌చెంగ్ ఎంతదూరం? అక్కడినుంచి వుత్తరం ఎన్నిరోజులకొస్తుంది?" అంటూ పెనిమిటి పేరురాకుండా జాగ్రత్తగా అడిగింది. సియావో అదిగ్రహించి నవ్వుకుంటూ పాయిరాసిన వుత్తరం జేబులోంచి తీసిచ్చేడు. తనకి చదువురాదుగనక సియావోనే చదివి వినిపించమంది.

ప్రియమైన షూ-యింగ్,

హులాన్‌లో ట్రైనింగ్ అయిపోయేక షువాన్ చెంగ్ పబ్లిక్ సెక్యూరిటీ ఆఫీసుకి పంపేరు నన్ను. నేను బాగానే వున్నాను. ఈ మధ్య ఏదో కంటి జబ్బు వచ్చింది కాని ఆఫీసు డాక్టరు నయం చేసేడు. సంవత్సరాది పండగ ఇంకా రెండు నెలలున్నాది కదా, అప్పటికి రావాలనుకుంటున్నా. ధాన్యంవంతా దంపించేవా? గవర్నమెంటు పన్ను కట్టేవా? ఇంటి దగ్గర బాగా పనిచెయ్యి. భూసంస్కరణ కార్యక్రమంలో వెనుకపడకు. ఇరుగు పొరుగుతో తగువు లెట్టుకోకు. తగువొచ్చినా మంచిగా సర్దుకుపో. కోపం తగ్గించుకో.

మరి వుంటాను. విప్లవాభినందనలతో

పాయి యు-షాన్

9-10-47

పాయిభార్యకి ఉత్తరమిచ్చేసేడు సియావో. మాటలు ఎవరు రాసిపెట్టినా భావాలన్నీ తన భర్తవేనని ఆమెకు తెలుసు. కాంగు మీదవున్న చిన్న బల్లమీద కప్పిన గుడ్డ కింద దాన్ని జాగ్రత్తగా దాచింది. సియావో వెళ్ళిపోయేక, ఉత్తరం దాయడానికి అదిసరైన చోటు కాదనిపించి చిన్న గూట్లో పెట్టింది. అదీ మంచిదికాదని ఆఖరికి పెట్టెలో పెట్టుకుని, అప్పుడు హాయిగా వూపిరిపీల్చి పని మొదలెట్టింది.

దారిలో సియావోకి హూవా యంగ్-సీ కనిపించేడు. అతను ఆవుకి నీళ్ళు పెడుతున్నాడు. నీళ్ళ గోలెంలో పోయగానే నీళ్ళు గడ్డ కట్టిపోతున్నాయి. తేలుతున్న మంచు గడ్డల్లోంచే ఆ ఆవు నీళ్ళు తాగుతోంది. వాళ్ళు పాతనేస్తాలే గనక సియావో అతన్ని పలకరించేడు. హూవా ఏదో మాట వరసకి చెయ్యి వూపేడు. నూతి పక్కనే మాట్లాడుతూ నిల్చున్నారుగాని మరీ చలిగా వుందని హూవా సియావోని ఇంట్లోకి తీసుకు వెళ్ళేడు.

ఇద్దరూ పక్కపక్కనే నడుస్తూ ఆవుని వెనుక నడిపించుకుంటూ వెళ్ళేరు. అదీఇదీ అడిగేక సియావో పశువుల గురించి, గుర్రాల గురించి అడిగేడు. ఆరో నెంబరు హన్ ఆస్తి పంచినపుడు హూవాకి గుర్రంలో నాలుగో వంతు భాగం వచ్చిందని సియావోకి గుర్తుంది. అతని భార్య, వెనకటి విధవరాలు, తనదగ్గరున్న డబ్బుతో మొత్తం గుర్రాన్నే కొన్నదని చెప్పేడు హూవా.

"మరి ఇప్పుడు ఆవు వుందేం? గుర్రం యింకా ఎక్కువ వేగంగా పోతుంది, బాగా మన్నుతుంది కూడా కదా?" అన్నాడు సియావో.

"నేదు బాబూ ఆవే యింకా మేలు. గుర్రంనాగ కాదే, ఆవు తక్కువ తింతాది. దీనికి రేతిరి మేత అక్కర్నేదే. ఇంకో ఏడాది పోయేక నా ఆవు ఈనదా మరి? అప్పుడు నాకు రెండు ఆవులుంతాయి. తల్లి సచ్చిపోయినా సెరమం వుంటాది కాదా?"

రైతులు గుర్రాలకన్నా ఆవుల కోసమే ఎందుకు ఎగ బడతారో సియావోకి బోధపడింది.

"గుర్రాన్ని పబ్లిక్ ట్రాన్స్‌పోర్ట్‌కి కూడా పంపాల్సొస్తుందని కదూ?"

"నేదు బాబూ" అన్నాడు హూవా యింకేమనాలో తోచక.

హూవా యిప్పుడేంవన్నా మాట్లాడగలిగినా, లెక్కలు బేరీజులు వేయగలిగినా అదంతా అతని భార్య చలవే. పెళ్ళిచేసుకున్న దగ్గర్నుండి గ్రామ కార్యక్రమాల్లో

వెనకబడ్డాడు. భార్య మాటకి ఎదురాడలేడని వూరందరికీ తెలుసు. భూసంస్కరణలో పాల్గొనే రోజుల్లో "ముందు ఇంటగెలిచి రచ్చగెలవా నీ", తన ఇల్లు తాను చూసుకోవడం ముఖ్యమనీ పెనిమిటిని వారించింది. ఇద్దరు చాలాసేపు వాదులాడుకున్నారు.

"నువ్వింకో సుట్టుగాని రైతుసంగానికి ఎల్లినావంటే నిన్నిడిసి ఎల్లిపోతాను" అని బెదిరించింది.

హువారునో మూతపడిపోయింది. అతనిప్పుడు నలభయ్యో పడిలో ఉన్నాడు. అటు పడుచూకాదు, ఇటు ముసలీకాదు. మొన్నమొన్నటిదాకా అతనుఏకాకే. అరుగాలం శ్రమపడి, పొద్దోయి యింటికొస్తే గంజి కాచిపోసే దిక్కులేదు. ఈమెవచ్చేక తనకిసుఖంగా వుంటోంది. ఈపాటి సుఖాన్ని వదులుకునే స్థితిలోలేడతను. అందుకే ఆమెమాట వేదవాక్కుతనికి. సాయుధ దళంలోంచి తప్పుకున్నాడు. రైతుసంఘానికి వెల్లడంకూడ మానీసేడు. గుర్రం పబ్లిక్ ట్రాన్స్‌పోర్ట్‌కి వెళ్ళాల్సి వస్తుందని ఆమె ఎవరికో గుర్రమిచ్చి ఆవు బదులు తీసుకుంది. పబ్లిక్ ట్రాన్స్‌పోర్ట్‌కోసం పిలుపొస్తే "ఏటిసెయ్యను? నాదిఆవాయె. గుర్రంతోసమంగా ఇది పరుగెత్తనేదే!" అనేవాడు. అందుకే అతన్ని పబ్లిక్ ట్రాన్స్‌పోర్ట్‌కి పిలిచేవారుకాదు. అతనిభార్య, లీ-చెన్ చియాంగ్‌భార్య స్నేహితులు. కువోని తొలగించి చాంగ్ ఫూ-యింగ్, లీకీ-యంగ్ పదవి చేజిక్కించుకున్నపుడు అది అన్యాయమని హువాకితెల్సినా నోరువిప్పి పైకి ఏమీఅనలేక పోయేడు.

సియావో గేటుదాటి లోపలికి అడుగుపెట్టగానే దూరంగా హువాభార్య పందిని మేపుతూ కనిపించింది. అతన్నిచూసి పలకరింపుగా తలాడించిందేగాని లోపలికి ఆహ్వానించలేదు. హువా తబ్బిబ్బయి సియావోని లోపలికి రమ్మన్నాడు కాని పరిస్థితి గ్రహించి సియావో లోపలికి పోలేదు. కొంచెంసేపు బైటేనిల్చుని వెళ్ళిపోతూ

"హువా, కృతఘ్నుడివి కాకూడదు సుమా" అని హెచ్చరించేడు

"నేదు నేదు బాబూ, అలాగుండను" అని గొణిగేడు.

రైతుసంఘం ఆఫీసుకి వెళ్ళేక సియావో పార్టీ సభ్యత్వం కోసం ముందుకొచ్చిన వారిపేర్ల జాబితా చూసేడు. అందులో హువాపేరు సియావోనే ఆమోదించేడు. ఆరు నెలల శిక్షణకాలం పూర్తయింది కాని హువా సభ్యుడుకాలేదు. బందిపోట్లని తరిమి కొట్టడంలో అంత ధైర్యంచూపిన హువా ఆఖరికి పబ్లిక్‌ట్రాన్స్‌పోర్ట్‌లో కూడా చేరలేదు. ఇది తప్పకుండా దిగజారుడే. కాని హువా శిక్షణకాలాన్ని పొడిగించవలసిందిగా అధికారులను కోరేందుకు నిర్ణయించుకున్నాడు సియావో. ఒకప్పటి ధైర్యశాలి ఇప్పుడు దిగజారడానికి కారణం ఆ విధవరాలే అయివుంటుందని పించింది. ఈ విషయాన్నింకా పరిశీలించేందుకు, అవసరమైతే పైఅధికారులకు తెలిపేందుకు నిశ్చయించుకున్నాడు సియావో. (ఇంకా వున్నది)

# కుక్క బతుకు

హెచ్చార్కె

"సామ్రాట్టు" రాజారావుగారి కుక్క.

రాజారావు ఆ వూరికి దొర.

దొర సంగతి తరువాత. ఇప్పుడు కుక్కకథ చెప్పుకుందాం.

సామ్రాట్టుకు కొన్ని రోజులుగా ఒక కోరిక పీకుతోంది. అది చిన్నప్పట్నుంచీ దొరగారి బంగళాలోనే పెరిగింది. ఆ గడీ, దొరగారు షికారు పోయేతోట తప్ప మరొకటి చూసి ఎరగదు. ఒక్కసారి, ఒక్కటంటే ఒక్కసారి తన కిష్టంవచ్చినట్లు అలా, అలా, అలలా తిరిగి రావాలని దాని కోరిక.

ఒక సాయంకాలం దొరసాని సామ్రాట్టును గొలుసువిప్పి, కాసేపు ముద్దుచేసి, మళ్ళీ కట్టేయడం మరిచిపోయి, యింట్లోకి వెళ్ళింది. మిగిలిపోయిన బిస్కట్ల ముక్కలు కొరుకుతోంది సామ్రాట్టు. బిస్కట్ల తీపిని మరిపించేట్లు చల్లనిగాలి వచ్చి తగిలింది. శుభ్రమైన గోధుమరంగు రోమాలు అలల్లాగ కదిలాయి. అది ఎప్పుడూ అణిచేసుకుంటున్న కోరికే దాని చర్మాన్నంతా కావలించుకున్నట్లయింది. ఏమైనా సరే బయటికివెళ్ళి రావాలనిపించింది దానికి.

దొరగారు షికారుకు వెళ్ళేలోగా రాలేకపోతానా లెమ్మని బయలుదేరింది.

సామ్రాట్టు వూరు దాటింది.

దాని కంతా కొత్తగా వుంది. గొప్పగా వుంది.

ఏట్లోంచి వచ్చే చల్లని గాలి దాన్ని ఎక్కడికో తీసుకు పోతోంది.

ఏటి గట్టున బట్టలుతుకుతున్న చాకలాళ్ళు "యిస్సో, యిస్సో" అని అరుస్తున్నారు. తననే కాబోలనుకుని అటువైపు పరిగెత్తింది కుక్క. ఒకాయన దగ్గరకు వెళ్ళి నిలబడి "ఏమిటన్నట్లు" చూసింది. కాని ఆ పెద్దమనిషి సామ్రాట్టును చూడనే లేదు. ఇంకో పిలుపువిని మళ్ళీ పరిగెత్తింది. ఉహు! తనను గురించి కాదు.

అలాగే ఏటి గట్టున నడుస్తూ అడివి చేరింది. చెట్లమీద ఆకులు "గల గల" మని ఏమిటేమిటో అంటున్నాయి. పిట్టలు గాలిలో గిరికీలు కొట్టి మళ్ళ కొమ్మలమీద కూచుంటున్నాయి. బుద్ధిపుడితే కుక్కకు అర్థం కానిదేదో పాడుకుంటున్నాయి. రకరకాల పూలు సామ్రాట్టు మీద పడి "ఎక్కడికి నేస్తం" అని పలకరించాయి. పూల భాష అర్థంకాక చిరాగ్గా విదిలించింది కుక్క.

ఇంకా ముందుకు వెళ్ళింది. కుందేలు పిల్ల ఒకటి టకటక గెంతుకుంటూ వచ్చి, చెవులు రిక్కించింది. సామ్రాట్టు పళ్ళికిలించింది. కుందేలు పిల్ల భయపడిపోయి పక్క పొదలోనికి తుర్రుమంది. 'పిల్లడు సిగ్గుపడ్డాడు' అనుకుంటూ ముందుకుసాగిపోయింది సామ్రాట్టు. తనకు రోజూ వచ్చిపడే పచ్చిమాంసం ముక్కలు ఎక్కడినుంచి వస్తాయో దానికేం తెలుసు, పాపం.

మరోచోట, అది తనవైపు క్రూరంగా చూస్తున్న రెండు కళ్లను చూసి దడుసుకుంది. ఆ కళ్ల వెనుక శరీరం నల్లగావుంది, కాని రూపంలో తనలాగే వుంది. అది తోడేలని, తన్ని దెబ్బకు చంపేస్తుందనీ తెలియకపోయినా, దాని కళ్లలో క్రూరత్వాన్ని చూసో, లేక దాని కళ్లల్లో తన దొరగారి కళ్లు కనిపించాయో- భయమేసి పక్కకుడూకి పరిగెత్తింది.

పోగా.... పోగా.... పోగా....

ఒకచోట, యింతపొడుగ్గా, కొమ్మలు కొమ్మలుగా తిరిన కొమ్ములతో, తల నేలకు వేలాడేసి పడుకున్న దుప్పి ఒకటి కనిపించింది. అది దిగాలుగా వుంది. అది సరిగ్గా తనలాగే గోధుమ రంగులో మెరుస్తోంది. కాని దాని కొమ్ములు చూస్తే సామ్రాట్టుకు విచిత్రమయింది. దాని దిగులు చూసి కొద్దిగా జాలి కూడా వేసింది.

"మీరెవ్వరండి" తాను నేర్చుకున్న నాగరీకం భాషలో సగర్వంగా, పిసరంత సానుభూతి కూడా రంగరించి పలుకరించింది.

"నేను దుప్పిని, నువ్వెవ్వరు?" అడిగింది దుప్పి. మొరటుగా, సామ్రాట్టు కోరలు చూసి కొంచెం అనుమానంగా.

"నాపేరు సామ్రాట్టు"

"అట్లాంటి జంతువున్నట్టు నాకు తెలీదే"

"అస్సలు, నేను కుక్కను. కాని చాల విశ్వాసపాత్రుణ్ణట. అందుకని దొరగారు, దొరసాని వాళ్లంతా నన్ను సామ్రాట్టని పిలుస్తారు" గర్వంగా మోర పైకెగరేసి అంది.

అదే మళ్లీ అడిగింది "ఏమిటి? నువ్వు ఎందుకలా దిగాలుగా వున్నావు."

"ఆకలేస్తోంది. పొద్దట్నుంచీ వంట్లో బాగోలేదు. గడ్డీ, ఆకులూ తినాలనిపించటంలేదు." మరింత దిగాలుగా ముఖంపెట్టి చెప్పింది దుప్పి.

"అయ్యోపాపం. ఊళ్లోకి వెళ్లలేదూ"

"ఊళ్లోకి ఎందుకు వెళ్లాలి?" దుప్పి విసుగ్గా అడిగింది, బోడి సలహా చెప్పొచ్చావన్నట్లు.

"నీకేం తెలీదే? ఊళ్లోకివెళ్తే, అక్కడ దొర లుంటారు. మంచి, మంచి మాంసం ముక్కలు పెడతారు. అవి నీ కిష్టం లేకపోతే తియతీయని బిస్కట్లు పెడతారు. సుస్తే చేస్తే డాక్టరు దగ్గరకు తీసుకుపోయి నయంచేయిస్తారు."

"అంత బాగుంటుందా వూళ్లో" దుప్పి వుత్సాహంగా అడిగింది.

"మరేమనుకున్నావు, పిచ్చివాడా!? ఆకలేసినప్పుడల్లా దొరగారి దగ్గరకో, దొరసాని దగ్గరకో వెళ్లి మూతిపైకెత్తి, తోకాడిస్తే సరి. అక్కడికీ కుదరకపోతే, వాళ్ళ కాళ్లు నాకితేసరి "అరెసామ్రాట్టూ, ఆకలేస్తోందిరా నీకూ" అని మాంసం ముక్కలో, బిస్కట్లో పడేస్తారు.

అంతేకాదు, మంచి, మంచి వాసన సబ్బులతో స్నానం చేయిస్తారు. ఫ్యాను గాలికింద ఎంచక్కా నిద్రపోవచ్చు. ఇంక, సుస్తీ చేస్తే. ముడుచుకు పడుకున్నా మంచే చాలు, డాక్టరు దగ్గరికి తీసుకుపోతారు.

"నాకు తెలీదే యివన్నీ. నువ్వేం చెయ్యనక్కరలేదా? తిండి వూరికే వస్తుందా. నీ మీద తోడేల్లూ అవీ పడిచంపేయవా? ఏం భయముండదా?" దుప్పికి సామ్రాట్టు ఎక్కడో స్వర్గం గురించి చెబుతున్నట్లయ్యి, ప్రశ్నమీదా ప్రశ్న అడిగింది.

"ఏంచేయ నక్కర్లేదు. సాయంకాలం దొరగారితో షికారుకు పోవాలి. రాత్రిళ్లు జాగర్తగా కాపలాకాయాలి-"

దుప్పి మధ్యలో అడ్డుతగిలింది.

"కాపలా ఏమిటీ?"

"కాపలా అంటే.... దొరగారింట్లో ఎన్నెన్నో వస్తువులుంటాయి. బీరువాలో డబ్బులూ, నగలూ వుంటాయి. గరిసెల్లో తిండి గింజలుంటాయి. వాటిని ఎవరైనా దొంగతనంగా ఎత్తుకు పోవడానికి వస్తే మంనంలేచి మొరగాలి. వాళ్ల మీద పడి కరవాలి."

"ఎందుకట్లా దొగతనం. వాళ్లకుండవా అవన్నీ?"

"ఉండవు. వాళ్లంతా అలగా జనమంట. దొరగారూ, దొరసానీ ఎప్పుడూ తిడుతూవుంటారు, సాయంకాలాలు వాళ్లు కూలి గింజల కోసం గంపలు పట్టు కొచ్చినపుడు. వాళ్లను నేను చూశాన్లే. మట్టి కొట్టుకున్న మొహాలూ, వాళ్లూనూ."

"కూలీ ఏమిటీ? తిట్టడమెందుకూ?"

"వాళ్లంతా పొలంలో పనిచేస్తారంట. 'వెధవలు పొద్దు పొడిస్తేగాని పొలానికి రారు. పొద్దు గుంకిందో లేదో యిళ్లకు పోతామని ఏడుస్తారు' అని దొరగారు తిడు తుంటారు. అట్లా పని చేసినందుకే కూలి. కాని వాళ్లకు కూలి గింజలు చాలవు. దొంగతనం చేస్తారు. అందరు కాదనుకో, కాని దొరగారయితే అందరు దొంగలే నంటారు. వాళ్లంటే ఆయనకు భయం కూడా."

"మరలాంటప్పుడు వాళ్ల పనిచేస్తే వచ్చిన గింజలేగా. వాళ్ల ఎత్తుకుపోతే నీకేం"

"బాగుంది. వాళ్ల పనిచేస్తే. అవి మన దొరగారివి కావా?" ఎంత పిచ్చివాడి వన్నట్లు చూసింది కుక్క.

"పొలాల్లో పనిజేసే వాళ్లకు లేకుండా, దొరగారికే ఎట్లా వచ్చాయి అవన్నీ"

"అదంతేలే. నీకు తెలీదు. అవి దొరగారివే. దొరగారికి దేవుడిచ్చాడు."

దుప్పికి యీ వ్యవహారమేం నచ్చలా, కాని దానికి వళ్లంతా నెప్పిగా వుంది. ఆకలి కూడా వేస్తోందేమో, బిస్కట్లు గుర్తుకొచ్చి నోరూరుంది.

ఇంతలో సామ్రాట్టు మెడ మీద నల్లని పట్టీ దుప్పి కళ్లలో పడింది.

"అద్సరే గాని అన్నా! నీ మెడలో అదేమిటీ? నల్లగా మెరుస్తోందీ?" అడిగింది.

"అదా, పట్టీ – తోలుపట్టి. దొరగారు దీనికి గొలుసు కట్టి తన చేత్తోపట్టుకుని షికారుకు తీసుకుపోతారు. మిగతా సమయాల్లో నయితే అదే గొలుసుతో స్తంభాని కట్టేస్తారు."

"ఛీ, ఏంబతుకు? బానిసబతుకు, నీ సొంతానికి ఏంబతికినట్టు." యిష్టంగా ఎగరడానికి, తిరగడానికీ వీల్లేనిస్థితి గుర్తుకొచ్చి దుప్పికి అసహ్యమేసింది.

కుక్క చిన్నబుచ్చుకుంది. "నదీలే సంబడం. గడ్డితినేబుద్ధి బిస్కట్లరుచేం తెలుసు....జెరమొస్తే మందుకు గతి లేదుకానీ- కబుర్లకేం తక్కువలేదు." ఉక్రోషంతో యీసడించింది.

నిరుత్సాహంవల్ల కబుర్లుబోరుకొట్టాయి సామ్రాట్టుకు.

విసుగ్గా చుట్టూ చూసింది.

"అయ్యో చీకటిపడింది. దొరగారు యీరోజు చావ గొడతారు" గొణుక్కుంది, వణుక్కుంటూ.

"ఎవడ్రావాడు కొట్టేది. పొడిచి పేగుల్దియ్యకా...." దుప్పి దిగ్గున లేచింది. మీదకు ఎవరో రాబోతున్నట్లు కొమ్ములు ఎక్కుపెట్టింది.

కుక్కకు యివేవీ వినిపించలేదు. నోరు తెరిచి, నాలుక వేలాడేసుకుని, తోక ముడిచి వూరివైపు పరుగులు తీసింది.

*　　　*　　　*

"కథ బాగోలా" సుబ్బారావు అడిగాడు.

"బాగుంది కానీ...." నానిగాడు వుత్సాహంగా ఏదో అడగబోయాడు. కథ పూర్తయినట్లనిపించలా వాడికి.

"సుబ్బారావుగారూ" బయటినుండి కేక.

ఆఫీసు బంట్రోతు.

"ఏమప్పా చెన్నయ్యా, ఏం సంగతి"

"దొరగారు రమ్మంటున్నారు"

"ఇప్పుడే గదయ్యా, ఆఫీసు నుండి వచ్చింది. ఈ సాయంత్రం పూట ఏమొచ్చిందని? పెళ్లాం పిల్లలతో కాసేపన్నా బతకనీయరా, ఏం?"

సుబ్బారావు విసుక్కుంటూ లేచి చొక్కా, లాగూ వేసుకున్నాడు.

"నాన్నా, మరే.... కుక్క తొందరగా వెళ్లనందుకు దొరగారు నిజంగా చావ గొట్టారా?" నానిగాడు వున్నట్టుండి అడిగాడు.

"చావగొట్టడమేంటి. తన్ని తగిలేస్తాడు బయటకు" సుబ్బారావు చిరాగ్గా అంటూ త్వరత్వరగా వెళ్లిపోయాడు.

నానిగాడికి దుప్పి అంటే భలే యిష్టం ఏర్పడింది. ఎందుకో?!?!!

---

## చిగురించిన జీవం

శంకర్

రక్తంతో తడిసిన తూటాలతో
తూట్లు పడక ముందే
తెప్పరిల్లిన వృక్షం
తనను పెనవేసికొని
చావనున్న మనిషిని అడిగింది:
మవ్వు చేసిన తప్పేమిటని.

సమాధానం: చిరునవ్వు.
ఆ నవ్వులో—
ఉదయించే కోటి సూర్యుల
అరుణిమ తళుక్కుమంటే
దాని భాష్యాన్ని
ప్రతి ఆకుపైనా రాసుకుంది.

మా జీవితాలకు
మతం పిరమిడ్లు కడ్తోంటే
శిలువల్ని మాకు సింగారిస్తోంటే
సహగమనం చేయిస్తోంటే
యజ్ఞాల్లో, అగ్నికీలల్లో వేల్చుతోంటే
మా బ్రతుక్కి 'సైనేడ్' పూస్తోంటే
సహిస్తున్నాం - సహిస్తున్నాం
మా పాపల కళ్ళల్లో-
కాంతి పుంజాలకి బదులు ఆకటి కన్నీళ్ళు
మాబిడ్డల ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో-
ఆరోగ్యానికి బదులు అంటురోగాలు
చుట్టూతా ఈగలు దోమలు

## ఎంత సుందరం

దీప్తిజ్వాల

కలరాలూ మలేరియాలూ
గంగమ్మలూ పోలేరమ్మలూ
ఎంకన్నలూ అప్పన్నలూ
మొక్కుబడులూ మెహర్బానీలూ
నాటుసారా పేకముక్కలూ
దేవుళ్లూ దెయ్యాలూ
నిరాశా చీకటే
ఎంతసుందరం
మాజీవితం।

---

## తిరగబడి దీనంతు తేల్చరా!

తిరునగరి రామాంజనేయులు

ఏమిబతుకులు మనయిరా, సిన్నోడ
ఎన్నాళ్ళుసూస్తావురా, ఈశాకి
రెన్నాళ్ళు సేస్తావురా॥

పోడై తెగొట్టావు
బూముల్ని దున్నావు
పంటకీ మలిపావు
బూసామికొదిలావు;
నీదన్న దేటుందిరా, పేదోడ
విలువ నీడేలేదురా ॥ఏమి॥

రేయి పగలు జేసి
రెక్కలే వుడిగాయి
బండ శాకిరి జేసి
కండలే కరిగాయి
అరుగాలము జేసినా, బతుకులో
మారుపే రాదేటిరా ॥ఏమి॥

పాసిపోయిన మాడు
పులిసిపోయిన గటక
పరమాన్న మోలెతిని
బెమ్మరాతంటావు
నీ కష్టమెటుబోయెరా, దొరలకే
విలువుబోసీడాయెరా ॥ఏమి॥

కర్మ మంటావునీ
కడుపు మాడుస్తావు
కష్టపడి సోమరుల
గాదెలకు పోస్తావు
అన్యాయ మయ్యావురా, నాతండ్రి
నిన్ను బలితిన్నారురా ॥ఏమి॥

తరతరాలుగయిదే
తంతు సాగీపాయె
తిరగబడి దీనంతు
తేల్చరా కూలన్న
ఎర్రజండా నెత్తరా, పేదోడ
ఎదిరించి పోరాడరా ॥ఏమి॥

కష్టపడ్డోనికే
కలిమి బలిమిగల్లు
కూలిరైతు ప్రజల
పాలనే పొందాలి
పిడికిలే బిగియించరా, నావోడ
పిడుగులే కురిపించరా॥

# కన్నబిడ్డ

ఎన్నారెస్

తల దువ్వినట్టాగ
బూఁవంత దున్ని జువ్వియ్యో
బూమి పాయ దున్ని ,,

పొల్ల పెయ్యికి పోసినట్టు
పొలం నీల్లుబెట్టి జువ్వియ్యో
బూమి తడువబెట్టి ,,

ఆరుగాలం రాత్రి పగలు
రెక్కలిరుసుకొని జువ్వియ్యో
బొక్కలిరుసుకోని ,,

కాల్లు కడుపుల పెట్టకోని
సలికి ముడ్సుకోని జువ్వియ్యో
వనుకు పట్టిపొయ్యి ,,

వత్తోలె పత్తోలె
వానల్లా తడిసీ జువ్వియ్యో
రాయిలా నిలిసీ ,,

చిట్లీన కుండోలె
మండే ఎండల్లో జువ్వియ్యో
నెత్తురు చెమటల్తో ,,

బూఁవీని చీల్చుక మొలిచే
మొలక కొరకు ముండూ జువ్వియ్యో
నువ్వు మొలకవయ్యా లేపి ,,

సూరీన్ని నిద్దురలేపి
పిట్టల కదిలించి జువ్వియ్యో
గొడ్లను అదిలించి ,,
పాదు పాదు తవ్వి నువ్వు

కండ్ల కద్దుకోని జువ్వియ్యో
పాదు మెత్తినువ్వు ,,

పొత్తిల్ల పిల్లోలె
సాదుకోని నువ్వు జువ్వియ్యో
సాగుజేసుకుంటె ,,

నాగూల కిచ్చిన
నాప గింజలాకు జువ్వియ్యో
పంటంతా పాయె ,,

అరువులకు దెచ్చిన
ఎరువు మందులాకు జువ్వియ్యో
పూసపోగుబాయె ,,

నిన్న బుట్టిన పిల్లదొరలు
నీ తాత కిస్తినానీ జువ్వియ్యో
అరె! అప్పు కక్కమానె ,,

ఎకరం బూఁవీ అప్పులడ్డికీ
బెల్లుబాను జేసి జువ్వియ్యో
ఒల్లు దులుపుకుంటే ,,

పొరుగింటికి కోడలైన
నీ కన్నబిడ్డవోలె జువ్వియ్యో
నువ్వు జూసుకుంటె ,,

యెన్నడు బుక్కెడు కూడు సక్కగ
తిన్నోనివి గాదు జువ్వియ్యో
గంజికె గతిలేదు ,,

నువు సాదిపెంచిన పోదనజేసిన
పంట గింజమీద జువ్వియ్యో
నీ కదికారంలేదు ,,

కాలుమీద కాలేసుకున్న
కామందు సైగజేస్తె జువ్వియ్యో
కదిలిపోయె పంట ,,

చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిల్లాయె జువ్వియ్యో
బూసాముల పాలాయె ,,

సలిచీమల చేతజిక్కి
ఎంత పెద్దవైనా జువ్వియ్యో
సచ్చుర సర్పాలు జువ్వియ్యో

# కుటుంబం, వ్యక్తి ఆస్తి, రాజ్యం పుట్టుక - ఫ్రెడరిక్ ఎంగెల్స్

## 1. కుటుంబ వ్యవస్థా చరిత్ర రచన

మార్క్స్ తన జీవితకాలంలో కుటుంబం, వ్యక్తి ఆస్తి, రాజ్యం వీటిపుట్టుక, పెరుగుదల గురించి గ్రంథంరాద్దామనుకుని, రాయలేదు. "జర్మన్ ఫిలాసఫీ" లాంటి గ్రంథాలలో తన పరిశీలన ఫలితాలను కొన్నింటిని ఉటంకించడమైతే జరిగింది. పైగా, మోర్గన్ రాసిన "ఏన్షియంట్ సొసైటీ", అంతక్రితం రాసిన "సిస్టమ్ ఆఫ్ కన్‌సాంగ్వినిటీ అండ్ అఫ్ఫినిటీ ఆఫ్ ది హ్యూమన్ ఫేమిలీ" లను చదివి, వాటి సారాంశాన్ని రాసి పెట్టుకోవడం జరిగింది. మార్క్స్ నిర్ణయాలను దృష్టిలో ఉంచుకుని, మోర్గన్ గ్రంథం ఆధారంగా, ఎంగెల్సు 1884లో ది ఆరిజిన్ ఆఫ్ ది ఫేమిలీ, ప్రైవేట్ ప్రాపర్టీ అండ్ ది స్టేట్"ను మొదట ప్రకటించాడు. కొద్ది కాలంలోనే అది అనేక ముద్రణలు పొందింది. అనేక యూరపియన్ భాషలలోకి తర్జుమా అయింది కూడా. మోర్గన్ తర్వాత వచ్చిన టేలర్ కోవెలవెస్కీలాంటి ఇతర సమాజ శాస్త్రజ్ఞుల రచనలనూ మిషనరీల పరిశీలన ఫలితాలనూ ఎంగెల్స్ తన పుస్తకంలో వాడుకొన్నాడు.

గత శతాబ్దం ఆరవ దశకం మొదలయేంత వరకూ, కుటుంబ వ్యవస్థ గురించి శాస్త్రీయమైన అవగాహన గలిగిన సక్రమమైన వివరణ ఏదీ ఉండేది కాదు. "ఓల్డ్ టెస్టమెంట్" లోని మోజెస్ గ్రంథ పంచకంలో వర్ణింపబడిన పితృస్వామిక వ్యవస్థే, అనాదికాలం నుంచీ అనేక పరిణామాలకు లోనైన వైవాహిక, కౌటుంబిక వ్యవస్థకు మారుగా యూరపియన్ల మనస్సులను శాసిస్తూ ఉండేది.

బచోఫెన్ : బచోఫెన్ అనే జర్మన్ విద్వాంసుడు 1861లో "మదర్ రైట్" అనే గ్రంథాన్ని ప్రకటించటం తోటి మానవ కుటుంబం గురించి శాస్త్రీయమైన చరిత్ర రచన ప్రారంభమైనట్లు భావించవచ్చు.

అనాది కాలంలో మనుషులు వావీవరసా పాటించకుండా పరిపూర్ణమైన లైంగిక స్వేచ్ఛను అనుభవించేవారని బచోఫెన్ నిర్ధారణ చేశాడు. దీన్ని "హెటారిజం" అని ఆయన వర్ణించాడు. ఈమాట తదనంతర కాలానికి సంబంధించింది కాబట్టి ఆదిమ మానవ లైంగిక స్వేచ్ఛపట్ల దాన్ని ప్రయోగించడం ఉచితంకాదు. 'హెటారే' అనే వాళ్ళు గ్రీస్‌లో ముఖ్యంగా అయోనియనలో అవివాహితలై, లైంగిక స్వేచ్ఛ గలిగిన

కొద్దిమంది స్త్రీలు. మన సమాజంలోని దేవదాసీలకు సమానమైనవాళ్లు. ఆదిమ లైంగిక స్వేచ్ఛా జీవితం తాలూకు అవశేషాలేగాని మరొకటికాదు.

అలాంటి విశృంఖల లైంగిక జీవిత పరిస్థితిలో మానవ శిశువు ఏతండ్రికి పుట్టిందీ తెలియడం అసాధ్యంకాగా, ఏతల్లికి పుట్టిందీ తేల్చడం ఒక్కటే సులభం, సందేహాతీతం. కాబట్టి అలాంటి సమాజంలో ఫలానా తల్లికి బిడ్డనని కొడుకుగాని, కూతురుగాని చెప్పుకుంటారు. పురుషవంశ వృక్షంగాక, స్త్రీ వంశ వృక్షమే ఏర్పడుతుంది. స్త్రీకి పురుషుని కంటె గౌరవమర్యాదలు హెచ్చుగా ఉంటాయి. అంతేకాదు, స్త్రీపాలన (గైనికోక్రసీ) సాగుతుంది. (ఆర్యసమాజంలో కూడా దితిసంతానం దైత్యులనీ, అదితిసంతానం ఆదిత్యులని, కద్రువసంతు కాద్రువేయులని, వినత సంతు వైనతేయులనీ, ఇలా వర్ణించడం పరిపాటి. పితృస్వామిక సమాజం ఏర్పడిన తర్వాత కూడా ఈ పద్ధతి కొనసాగుతూ వచ్చింది ఉదా॥ కౌంతేయులు, మాద్రేయులు.)

<u>మోర్గన్</u> : 1871 లో మోర్గన్ అనే అమెరికా దేశస్థుడు ప్రకటించిన "సిస్టమ్ ఆఫ్ కన్‌సాంగ్యువినిటీ అండ్ అఫ్ఫినిటీ ఆఫ్‌ది హ్యూమన్ ఫేమిలీ"లో ఉత్తర అమెరికాలోని ఇరాక్వాయి తెగ రెడ్ ఇండియన్ల ఆచార వ్యవహారాల పరిశీలన ఫలితాలు సూత్రీకరింపబడ్డాయి. ఇతర అమెరికన్ రెడ్ ఇండియన్ తెగల ఆచార వ్యవహారాల పరిశీలన ఫలితాలతో ఇవి భేదించవు. హవాయిలోని ఆదిమజాతుల జీవిత పద్ధతుల పరిశీలనతో సరిపోల్చినపుడు వీటిరదనంతర రూపాలే అమెరికన్ రెడ్ ఇండియన్ తెగల జీవిత పద్ధతుల్లో మిగిలి ఉన్నట్లు తేలింది. అయితే అవి కూడా అంత కంటె వెనకటి మానవ జీవిత పద్ధతుల తాలూకు, ఇటీవలి పరిణామాలేనని, ఆస్ట్రేలియా ఖండంలోని నీగ్రోజాతి ఆదిమవాసుల జీవిత పద్ధతుల పరిశీలన నిరూపించింది.

<u>మెక్లెల్లాన్</u> : స్కాట్లండ్ దేశపు రచయిత మెక్లెల్లాన్ "ప్రిమిటివ్‌మేరేజ్" అనే గ్రంథాన్నీ, "స్టడీస్ ఇన్ ఏన్షియంట్ హిస్టరీ" అనే మరో గ్రంథాన్ని ప్రకటించాడు. వాటిలో మోర్గన్ సూత్రీకరణలను కొన్నింటిని నిరాకరించి, అతితెలివి చూపి కొన్ని అపసవ్యమైన సూత్రీకరణలను చెయ్యడం జరిగింది. వాటిలో ముఖ్యమైనది, ప్రాచీన మానవజాతులను వాటివాటి వైవాహిక నియమాలనుబట్టి పరస్పర, బాహ్యమైన రెండు విభాలకు చెందిన వాటినిగా "ఎండోగమస్ జాతులు" "ఎక్సోగమస్ జాతులు" అనే వర్గీకరణ. ఒక తెగకు చెందినవాళ్లు తమలో తామే వివాహాలు చేసుకునే నియమం ఉంటే, ఈసజాతి వివాహాల నియమంగల తెగలను "ఎండోగమస్" అనీ, ఒక తెగకు చెందినవాళ్లు పరాయి తెగనుండి మాత్రమే తమ భార్యలనూ, భర్తలనూ స్వీకరించే

నియమముంటే, ఈ విజాతి వివాహ నియమంగల తెగలను "ఎక్సోగమస్" అనీ మెక్లెల్లాన్ కృత్రిమంగా విభజించాడు. శుష్కతర్కాన్ని ప్రదర్శిస్తూ, ఈ ఇరుజాతుల మధ్య పరస్పర బాహ్యత్వాన్ని ప్రతిపాదించాడు. అలాగే అనేక భర్తృకత్వానికి ఆయన ఇచ్చిన వివరణ ఇలాఉంది. ఆదిమకాలంలో ఆడబిడ్డలను పుట్టిన వెంటనే చంపివేసేవాళ్లు. ఈ స్త్రీశిశు హత్యాకాండ ఫలితంగా స్త్రీల సంఖ్య కంటె పురుషుల సంఖ్య చాలా అధికమైంది. అందుచేత ఒకస్త్రీ అనేకులకు పత్ని కావలసిన అగత్యం ఏర్పడింది. విజాతి వివాహ నియమంగల ఆదిమజాతులన్నీ మొదట్లో బహుభర్తృకత్వాన్ని పాటిస్తూ ఉండేవి.

<u>లుబ్బాక్</u> : శాస్త్రీయ వివాహ వ్యవస్థా వివరణలో తర్వాత పేర్కొనదగిన రచయిత లుబ్బాక్. 1870లో ఆయన "ది ఆరిజన్ ఆఫ్ సివిలైజేషన్ అండ్ ది ప్రిమిటివ్ కండిషన్ ఆఫ్ మాన్" అనే గ్రంథం ప్రకటించాడు. ఇందులో మరొక కొత్త అంశాన్ని ఆయన బయల్పరిచాడు. ఒకానొక దశలో మనుషులు సమిష్టి వివాహాల పద్ధతిని (కమ్యూనల్ మేరేజి - గ్రూప్‌మేరేజి) పాటించేవారనీ తేల్చి చెప్పాడు. అంటే మగవాళ్లు కొందరు స్త్రీలను కొందరిని తమందరి భార్యలుగా ఎంచుకునే వారనీ, అలాగే ఆ స్త్రీలు ఆ పురుషులనందరినీ తమందరి భర్తలుగా ఎంచుకొనేవారనీ ఆయన ప్రతిపాదించాడు. అత్యంత ఆదిమ కాలంలోని విశృంఖల లైంగిక స్వేచ్ఛ, కాలక్రమంలో పొందిన పరిణామమే ఈ పద్ధతి.

<u>"మోర్గన్ ఏన్షియంట్ సొసైటీ"</u> : ఆ తర్వాత వెలువడిన గ్రంథం మోర్గన్‌ది. 1871లో ఆయన తన "ఏన్షియంట్ సొసైటీ"ని ప్రకటించాడు. మెక్లెల్లాన్ ప్రతిపాదించిన సజాతి - విజాతి వివాహ నియమాలు గల జాతుల పరస్పర బాహ్యత్వ సిద్ధాంతాన్ని ఇందులో మోర్గన్ పూర్వపక్షం చేయడం జరిగింది. ఒక జాతిలోనే కాలక్రమంలో పలుగణాలు (Gens) ఏర్పడి, మొత్తం జాతికి సంబంధించినంత వరకు సజాతి వివాహాలను ఆమోదించి గోత్రాలకు సంబంధించినంత వరకు సగోత్ర వివాహాలను నిషేధించడం జరిగిందని మోర్గన్ సిద్ధాంతం చేశాడు.

ఈ నిషేధానికి కారణం, రక్త బాంధవ్యం (కన్‌సాంగ్యునిటీ) అన్నాడు. ఒక గర్భాన పుట్టిన వాళ్ల మధ్య వివాహం నిషిద్ధమైందన్న మాట. మొదట్లో ఇది ఏకోదరులకు మాత్రమే పరిమితం. కాలక్రమంలో దీని పరిధి విస్తరించి, సమీప జ్ఞాతుల మధ్య వివాహాలను కూడా నిషేధించడం జరిగింది. బకోఫెన్ స్థాపించిన "మాతృ స్వామ్యం" (మదర్‌రైట్)ను మోర్గన్ మళ్లీ కనిపెట్టి, తిరుగులేని

# ఏరువాక

కిరణ్

ఏరువాక సాగెనురో రన్నో చిన్నన్నా !
నీ కష్టమంతా తీరునురో రన్నో రైతన్నా !
తూరుపు దిక్కున మెరుపులు మెరిసె –
దక్షిణ దిక్కున ఉరుములు ఉరిమె –
ఉత్తెర మబ్బులు ఉరుమురిమి కురియగ
సెర్లు కుంటలు నిండెనురో రన్నో
చిన్నన్నా
నీ సెమట కాల్వలై పారునురో రన్నో
రైతన్నా ॥ఏరువాక॥

అలపట దాపట ఎడ్లగట్టుకొని
ముల్లు గర్రను సేత బట్టుకొని
ఆలి పిల్లలను వెంట బెట్టుకొని
సద్ది మూటలను సంక గట్టుకొని
తూరుపు రేకలు వారక ముందె
తూరుపు దిక్కు నడువుమురో రన్నో
చిన్నన్నా
నీ కష్టమంతా తీరునురో రన్నో రైతన్నా
॥ఏరువాక॥

అడ్డీలప్పులు గట్టినవాడా !
పెద్దోల బదల్లు దెచ్చినవాడా !
దొరల ఉచ్చులు దెలిసినవాడా !
భూముల్లేని పేదవాడా !
గుండె దిటువు గలిగినవాడా !
రైతుకూలి సంఘంవాడా !
జండ నెత్తుకొని నడువుమురో రన్నో
చిన్నన్నా
పొరిగిన అన్నల దలువుమురో రన్నో
రైతన్నా ॥ఏరువాక॥

గరుక బలిసిన దొయ్యలు దున్ని
పెళ్లలు లేసే రేగల్లను దున్ని
పలుగురాళ్ల గెరెలు దున్ని
బుసబుస పొంగే బుడుగులు దున్ని –
అంపులు మిట్టలు ఏకం దున్ని
మట్టిని పచ్చగ జేసినవాడా !
మట్టిల గింజలు దీసినవాడా !
నీ కండ బలమే దండిదిరో రన్నో
చిన్నన్నా !
నీ గుండె బలమే గెలుచునురో రన్నో
చిన్నన్నా ! ॥ఏరువాక॥

నీ గింజల దోసిన వాళ్లనుబట్టి
గుంజకు దీసి గుంజీకట్టి –
నీ భూములు దోసిన వాళ్లనుబట్టి
ఊళ్లు దాటగ తరిమికొట్టి –
ఏరువాకా సాగుమురో రన్నో చిన్నన్నా !
నీ కష్టమంతా తీరునురో రన్నో
రైతన్నా ! ॥ఏరువాక॥

(పంటల సీజన్‌లో గారడివాడు పాడే ఏరువాక పాట మాదిరి)

---

సిద్ధాంతంగా స్థాపించాడు. మాతృ స్వామిక గణాలే ఆదిమమైనవి అన్నాడు. జీవ శాస్త్రానికి డార్విన్ పరిణామ సిద్ధాంతం ఎంత ముఖ్యమైనదో రాజనీతి – ఆర్థిక శాస్త్రానికి మార్క్స్ అదనపు విలువ సిద్ధాంతం ఎంత ముఖ్యమైనదో, ఆదిమ మానవ సమాజ చరిత్రకు మోర్గన్ "మాతృస్వామ్య" సిద్ధాంతం అంత ముఖ్యమైనది.

[తెలుగు సంక్షిప్తానువాదం: కె. వి. రమణారెడ్డి]

నడుస్తున్న చరిత్ర పుటల్లోంచి....

# మొన్న కంచిక చెర్ల, కీలవేన్మణి, నిన్న బెల్చి, చినఓగిరాల ఇవ్వాళ రామయ్యపల్లి... ఇంకా ఇంకా

మంథని పోలీస్ ఇనస్పెక్టర్, పెద్దపల్లి ఎఎస్‌పి, పెద్దపల్లిలోని స్పెషల్ పోలీసులతో కలిసి పెద్దపల్లి తాలూకా రామయ్యపల్లిలోని హరిజన, ఉప్పరి, చాకలి వాడలపై దాడిచేసి అమాయక హరిజనులను, ఇతర బీద, బలహీనవర్గాల వారిని నిర్దాక్షిణ్యంగా కొట్టారని పదకొండో జులైన ముప్పైమంది గ్రామస్తులను నిర్బంధించారనీ వారిని పోలీసుస్టేషన్లో హింసిస్తున్నారనీ సమాచారం అందగానే పౌరహక్కుల పరిరక్షణ సమితి (ఒపిడిఆర్) కరీంనగర్ శాఖ అధ్యక్షుడు జిల్లా కలెక్టర్‌ను, డిఐజిని, ఎస్‌పిని జులై పదహారున కలిశారు. ఈ పరిస్థితిపై తక్షణచర్య తీసుకోవాలని కోరారు.

ఐనా అధికారులు ఏ చర్యా తీసుకోక పోవడంవల్ల, నిర్బంధించిన వారిని విడుదల చేయకపోవడం వల్ల, విచారణకు ఉత్తర్వులివ్వక పోవడం వల్ల ఒపిడిఆర్ జిల్లాకమిటీ సంఘటన యొక్క వాస్తవాలు, కారణాలు కనుక్కోవడానికి జిల్లాఅధ్యక్షుడు శ్రీపర్వతాలు నాయకత్వాన ఒక వాస్తవ విచారణ సంఘాన్ని నియమించింది. ఈ సంఘంలో ఇతర సభ్యులు శ్రీ జి. రాంరెడ్డి (అడ్వకేట్), శ్రీ కె. వెంకటరావు (అడ్వకేట్), శ్రీ కె. రాంకిషన్ (అడ్వకేట్), శ్రీ ఎ. హనుమంతరెడ్డి, ఎం ఏ., శ్రీ టి. రవీందర్ (విద్యార్థినాయకుడు), శ్రీ టి. వేణు (ఉపాధ్యాయుడు).

ఆ సంఘం సమర్పించిన నివేదిక ఇది.

కరీంనగర్ జిల్లా పెద్దపల్లి తాలూకా రామయ్యపల్లిలో కె. నర్సింహారెడ్డి పెద్ద భూస్వామి. నర్సింహారెడ్డికి పక్కగ్రామం రాజాపూర్‌లోనూ, రామయ్యపల్లిలోనూ, మూడు వందల ఎకరాల భూమి వుంది. ఆయన ఊరి పట్వారీ. ఆయన కొడుకు వెంకట రాజారెడ్డి పోలీసుపటేల్. ఈ కుటుంబం చాలా కాలంగా గ్రామాన్ని పాలిస్తున్నది.

ముప్పైఏళ్ళకింద నర్సింహారెడ్డి తండ్రి హరిజన వాడకు ఆనుకొనివున్న పది గుంటల భూమిని బాటగా ఉపయోగించడం కోసం గ్రామస్తులకు ఇచ్చాడని చెప్తున్నారు. అప్పటి నుంచీ ఈ భూమి హరిజనవాడకు బాటకు వున్నది. కొంత కాలం కింద నర్సింహారెడ్డి ఆ భూమిని స్వాధీన పరుచుకొని బాటను మూసివేశాడు. ఇది హరిజనులకూ, భూస్వాములకూ మధ్య జగడానికి మూలకారణమయింది. భూస్వామి కర్కశ

ప్రవర్తనకు వ్యతిరేకంగా తమ ప్రజాస్వామ్య హక్కులను కాపాడుకునే ప్రయత్నంలో భాగంగా హరిజనులు భూస్వామికి 'సాంఘిక బహిష్కరణ' చేశారు.

జులై పదకొండున భూస్వామి గ్రామస్తులను పోట్లాటకు రెచ్చగొట్టాడు. ఇది తర్వాతి సంఘటనలకు భూమిక అయింది. భూస్వాములు పోలీసుల సహకారంతో, పెద్ద పోలీసు బలగంతో గ్రామస్తులపై విరుచుకు పడ్డారు. హరిజనులపై, ఇతర వర్గాలవారిపై అన్నిరకాల దౌర్జన్యాలూ సాగించారు.

ఈ సంఘం రామయ్యపల్లి గ్రామానికి జులై పందొమ్మిదిన పోయింది. చుట్టు పక్కల గ్రామాలనూ, దాడికి గురైన యిళ్ళనూ చూసింది. పోలీసులు ప్రస్తుతం మకాం చేసివున్న దొర బంగళాను చూసింది. గ్రామంలో జులై పదకొండున జరిగిన సంఘటనను అన్ని కోణాల్లోంచీ పరిశోధించింది. దొర బంగళాలో హెడ్-కానిస్టేబుల్‌తో మాట్లాడింది. సంఘం ఉప్పరివాడనూ, హరిజనవాడనూ, చాకలివాడనూ చూసింది. హరిజనవాడకు పోయేబాటను చూసింది. ఈ బాట పక్కన ఒక సంవత్సరం కింద పెద్దపల్లి రెవెన్యూ అధికారులు రాళ్ళు పాతించారు. ఈ రాళ్ళను దొర, ఆయన పాలేర్లు తీసివేశారు. ఈ సంఘటన మిగతా సంఘటనలకు మూలమయింది. సంఘం ఈ సంఘటనలో పాల్గొన్న, దౌర్జన్యాలకు గురైన వారందరితో మాట్లాడింది.

హరిజనుల ఫిర్యాదుపై ఒక సంవత్సరం కింద పెద్దపల్లి తాలూకా రెవెన్యూ అధికారులు హరిజనవాడకి పోయేబాట పక్కన హద్దు రాళ్ళు పాతించారు. జులై పదకొండున ఉదయం ఎనిమిది గంటలకు దొర.మనుషులు ఆ రాళ్ళు పీకేసి ఆ స్థలంలో దున్నడమూ, విత్తడమూ మొదలు పెట్టారు.

మొట్టమొదట రాళ్ళు ఎందుకు పీకేశారని అడిగిన హరిజనుడు కె. రాజమల్లుతో సంఘటనకు మూలకారణమయిన జగడం ప్రారంభమయింది. తిట్లు రెండు వైపుల నించీ జోరుగా సాగిపోయాయి. దొర ఈ విషయం పాలేరు ద్వారా విని, దారిలో గ్రామ మంగలి ఇంటి దగ్గరవున్న రాజమల్లును చూశాడు. రాజమల్లు హద్దు రాళ్ళు తిరిగి పాతవలసిందిగా కోరాడు. పోలీస్‌పటేల్ రాజమల్లును బూతులు తిట్టాడు. జనం గుమి కూడటం మొదలైంది. హద్దు రాళ్ళు తిరిగి పాతే సమస్యకు తిట్లు జవాబుకాదని, అనవసరంగా తిట్టొద్దని రాజమల్లు అన్నాడు. కొంత సేపటికి రాజమల్లును ఇంకా తిడ్తూనేవున్న వెంకటరాజారెడ్డి దగ్గరికి తండ్రి, పాలేరు వచ్చారు. రాజమల్లును చెయ్యో-కాలో విరగ్గొడతామని బెదిరించి వెళ్ళిపోయారు.

ఆ రోజు సాయంత్రం ఐదు గంటలకు ఐదుగురు పోలీసులతో ఒక పోలీసు జీపు రామయ్యాపల్లి వచ్చి ఉప్పరివాడలోని దేవునూరి కొమురమ్మ ఇంటి ముందు ఆగింది. పోలీసులు కొందరి కోసం అడిగారు. కొంత మంది హరిజనులు, కొంత మంది ఉప్పరివాడ ప్రజలు జీపు చుట్టూ మూగారు. మరి కొంత సేపటికి పోలీస్ పటేల్ సుంకరితో కలిసి పోలీసు జీపు దగ్గరికి వచ్చాడు. దొర పోలీసులకు కొందరి పేర్లు చెప్పి వాళ్ళను కొట్టవలసిందిగా కోరాడు. తనంత తానే సుంకరి దగ్గర్నుంచి బరిశ లాక్కొని కె. ఓదెలు తలపై కొట్టాడు. ఓదెలు తల నుంచి రక్తం కారడం మొదలైంది. ఐనా పోలీస్‌పటేల్ కొట్టే ప్రయత్నం చేస్తూనేవున్నాడు. దీనికి అక్కడ చేరిన ప్రజలు సహించలేక తమ నిరసన తెలియజేశారు. ఈ ఘర్షణలో జీపు ముందు అద్దం పగిలిపోయింది.

డి. కొమురయ్యను నిర్బంధించాలనే ఉద్దేశంతో పోలీసులు ఆయన ఇంటికి పోయారు. 'స్కైలాబ్' గురించి తాము భయపడుతున్నాం గనుక కొడుకును నిర్బంధించొద్దని కొమురయ్య తల్లి కొమురమ్మ పోలీసుల కాళ్ళపైపడి ప్రార్థించింది. వాళ్ళు ఆమె ప్రార్థనను లక్ష్యపెట్టకుండా పక్కకు తోసేసి ఇంట్లోకి పోయారు- ఆమె స్పృహతప్పి పడిపోయింది. పోలీసులు జీపు చుట్టూవున్న ప్రజల్ని చెదరగొట్టారు. ఇదంతా జరిగింతర్వాత అక్కడ్నించి పోలీస్‌పటేల్ జీపులో వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి ఎనిమిది గంటలకు పెద్దపల్లి ఎఎస్‌పి, మంథని పోలీస్ ఇన్‌స్పెక్టర్ నాయకత్వంలో మూడు వ్యాన్ల పోలీసులు దొర బంగళాకు వచ్చారు. వీళ్ళ వెంట మంథని సబ్-ఇన్‌స్పెక్టర్ కూడా వచ్చాడు. దొర, దొరకొడుకు ఇచ్చిన జాబితాల్లోని వ్యక్తుల యిళ్ళకు ఎస్ఐ, పోలీసులు గుంపులు గుంపులుగా వెళ్ళడం మొదలుపెట్టారు. ఆ యిళ్ళలో జొరబడి లోపలున్న వాళ్ళందర్నీ కొడుతూ, అసహ్యకరంగా తిడుతూ దొర బంగళాకు తీసుకొచ్చారు. రాజమల్లు, కొమురమ్మల యిళ్ళ తలుపులు విరగ్గొట్టి వాళ్ళను లాక్కొచ్చారు.

పోలీసులు స్త్రీలను కూడా విచక్షణ లేకుండా ఎక్కడబడితే అక్కడ కొట్టి విపరీతమైన హింసకు గురిచేశారు. వాళ్ళ మగవాళ్ళ గురించి ప్రశ్నించారు. ఉదా॥కి.

1. కొమురమ్మను మోకాళ్ళమీద, ఎడమకాలు మీదా విపరీతంగా కొట్టారు. ఆ దెబ్బల గుర్తులు ఇంకా కనబడుతున్నాయి. ఆ దెబ్బల వల్ల ఆమె యింకా నడవలేక పోతున్నది. సంఘటన జరిగిన మర్నాడు వచ్చిన రెవెన్యూ అధికారులకు ఆమె ఆ దెబ్బలన్నీ చూపెట్టింది.

2. చాకలి లక్ష్మిని ఎడమచేతి మణికట్టుపై పదే పదే కొట్టారు. ఇందు వల్ల ఆమె చేయి రక్తంలో తడిసిపోయింది. తొడల మీద కొట్టినందు వల్ల చీరమీద రక్తం పేరుకుపోయింది. ఈ గాయాలను మేం చూశాం.

4. డి. సుగుణను తనకేమీ తెలియదన్నప్పటికీ తొడలమీద కాళ్ళమీద కర్రలతో కొడ్తూ భర్త ఎక్కడున్నాడో చెప్పమన్నారు. ఈ గాయాలను మేం చూశాం.

4. శ్రీమతి కె. కౌసల్య కొడుకును పోలీసులు కొట్టారు. కొడుకును దొర బంగాళాకు తీసుకు పోయింతర్వాత ఈమెను మోచేతులపై కొట్టారు.

పోలీసు నిర్బంధంలో వున్న మగవాళ్ళకు అన్నం యివ్వడానికి పోయినస్త్రీలను నిర్బంధితులతో కలవనివ్వలేదు. ఇంతేకాక అప్పుడు గట్టమ్మను, రాజును కొట్టారు.

జూలై పదకొండున ముప్పైమంది గ్రామస్తులను నిర్బంధించారు. వారిలో ఆరుగురిని కొంతసేపటికి వదిలేశారు. మిగిలిన వారిలో పధ్నాలుగు మందిని పదమూడున మెజిస్ట్రేట్ ముందు హాజరు పరిచారు. రె.డోసారి తొమ్మిది మందిని పదహారున కోర్టులో హాజరు పరిచారు. మూడోసారి ఒకరిని పదిహేడున కోర్టులో హాజరు పరిచారు. ఇట్లా పధ్నాలుగు మందిని రెండురోజులు, తొమ్మిది మందిని నాలుగు రోజులు, ఒకరిని ఐదురోజులు చట్టవిరుద్ధంగా నిర్బంధించారు.

మంథని పోలీసుస్టేషన్లో వీళ్ళందర్నీ విపరీతంగా కొట్టారు. రామయ్యపల్లిలో దొర ఇంట్లో కూడా వీళ్ళందర్నీ కొట్టారు. పోలీసు హింసల వివరాలు కింది విధంగా వున్నాయి.

1. పి. తిరుమలరెడ్డి: ఈయన ఎడమ చేతి ఎముకలు విరిగిపోయాయి. కుడి కాలి చీలమండ ఎముక విరిగిపోయింది. ఎడమ భుజం ఎముకలు విరిగాయి. ఆయన తొడలపైనా, వీపుపైనా దెబ్బల గుర్తులున్నాయి. మంథని పోలీస్ ఇనస్పెక్టర్ ఆయన తలపై బూటుతో కొట్టాడు. ఈ దెబ్బలతో ఆయనను మంథని ప్రభుత్వ అస్పత్రికి తీసుకుపోగా అవి ప్రమాదకరమైన దెబ్బలు కనుక కరీంనగర్ ప్రభుత్వ అస్పత్రికి పోవాలని రాశారు. అక్కడ ఆయన ఎడమచేయికి కట్టుకట్టారు. ఎడమ భుజంపై రెండు కుట్లువేశారు. కుడికాలి చీలమండకు పట్టీవేశారు. సంఘం ఆయనను జైల్లో కలిసినపుడు నడవ లేకపోతున్నాడు; నిలబడ లేకపోతున్నాడు. ప్రమాదకరమైన గాయాల మూలంగా రక్తం ప్రవాహంగా కారింది. ఆయన బట్టలన్నీ రక్తంలో నానిపోయాయి. ఈయనను జూలై పదకొండున నిర్బంధించి జూలై పదహారున మెజిస్ట్రేట్ ముందు హాజరు పరిచారు.

2. కొలకాని ఓదెలు : జులైపదకొండు సాయంత్రం పోలీస్ పటేల్ తలపై కొట్టిన దెబ్బనుండి ఇంకారక్తం కారుతున్నది. ఆ రాత్రి మంథని పోలీస్ ఇనస్పెక్టర్, సబ్ - ఇనస్పెక్టర్ ఆయన ఎడమ చేయిపైనా, కుడిభుజంపైనా, వెన్నుపైనా కొట్టారు. ఆ తర్వాత ఆయన్ని తల కిందులుగా వేలాడదీసి వెనక ఒక పోలీసు పట్టుకున్నాడు. ఇంకో పోలీసు ఈయన పుడఘల మీదా, అరికాళ్ళమీద విపరీతంగా కొట్టాడు. ఇతన్ని సంఘం చూసింది. వైద్య సహాయం అందకుండా ఇంకా ఆ గాయాలతో ఆయన బాధపడుతున్నాడు.

3. కె. రాయమల్లు : ఈయన వెన్నుపై విపరీతంగా కొట్టారు. వెన్నుపై పదిపన్నెండు గాయాలు మాంసం బయటికివెళ్ళి ఇంకాపచ్చిగా వున్నాయి. ఆ తర్వాత ఆయన రెండు కాళ్ళూపైన కట్టివేసి వెనక ఒక పోలీసు పట్టుకోగా ఇంకో పోలీసు మడమల మీదా అరికాళ్ళ మీదా కొట్టాడు.

4. ఎస్. పోచాలు: జులై పదకొండున నిర్బంధించి విపరీతంగా హింసించారు. ఈయన కూడా పైన వర్ణించిన హింసలన్నీ అనుభవించాడు.

5. పి. వెంకటరెడ్డి : ఈయన తిరుమలరెడ్డి తమ్ముడు. ఈయనను జులై పదకొండున మంథని ఇనస్పెక్టర్ ఆఫ్ పోలీస్, పెద్దపల్లి ఎఎస్పి బాగా కొట్టారు. మంథని పోలీస్‌స్టేషన్‌కు తీసుకుపోయింతర్వాత కూడా కొట్టారు. రెండు మోకాళ్ళకూ, వెన్నుపై, ఎడమచెయ్యిపై, ఎడమతొడపై గాయాలున్నాయి. ఈ దెబ్బల గుర్తులు ఇంకా కనబడుతూనే వున్నాయి. సంఘం ఆ దెబ్బల గుర్తులు చూసింది. ఈయన చికిత్స గురించి అడిగితే మంథని ఇనస్పెక్టర్ ఆఫ్ పోలీస్ వైద్య సహాయమేదీ అందదని, చచ్చిపోవలసిందేననీ అన్నాడు. ఈ గాయాలు జైలర్‌కూ, జైలు కాంపౌండరుకూ చూపబడ్డాయి. ఈయనను జులై పదకొండున నిర్బంధించి జులై పదహారున మెజిస్ట్రేట్ ముందు హాజరు పరిచారు.

6. ఎస్. లింగయ్య : ఈయనను జులై పదకొండున నిర్బంధించి మంథని ఇనస్పెక్టర్ ఆఫ్ పోలీస్, స్పెషల్ పోలీసులు జులై పదకొండున, పన్నెండున క్రూరంగా హింసించారు. ఆయన వెన్నుపైనా, కాళ్ళపైనా, చేతులపైనా వున్న గాయాలను సంఘం చూసింది. ఆయనను జులై పదిహేనున కోర్టులో హాజరు పరిచారు.

7. ఎం. రాయమల్లు : జులై పదకొండున నిర్బంధించి పదకొండున రామయ్యపల్లిలోనూ, పన్నెండున మంథనిలోనూ ఇనస్పెక్టర్ ఆఫ్ పోలీస్ విపరీతంగా కొట్టాడు. ఈ గాయాల ఫలితంగా ఆయన బట్టలన్నీ రక్తంతో తడిసిపోయాయి.

8. డి. రామస్వామి : జులై పదకొండున నిర్బంధించి ఆనాడు రామయ్య పల్లిలోనూ తర్వాత మంథని పోలీస్‌స్టేషన్‌లోనూ బాగా కొట్టారు. ఈ దెబ్బలతో రక్తం ధారాళంగా కారిపోయింది. రక్తంలో నానిపోయిన బట్టలు సంఘం చూసింది. కొన్ని బట్టలు సంఘం తీసుకున్నది.

9. డి. రాజమల్లు : ఈయనను జులై పదకొండున నిర్బంధించారు. ఆనాడూ, మర్నాడూ విపరీతంగా హింసించారు. ఈ దెబ్బల ఫలితంగా చాలా రక్తం కారి పోయింది. బట్టలన్నీ రక్తంలో తడిసిపోయాయి. ఈ బట్టలు సంఘానికి చూప బడ్డాయి. వాటిల్లో కొన్ని సంఘానికి ఇవ్వబడ్డాయి.

10. వడ్డెర వీరయ్య : మహబూబ్‌నగర్ జిల్లా నుంచి వచ్చిన ప్రాజెక్టు కార్మికుడైన ఈయనను కూడా పోలీసులు వదలలేదు. తీవ్రమైన గాయాలు అయ్యేట్టుగా వాళ్ళాయనను కొట్టారు. కుడి అరచేయి పగిలి రక్తంకారుతూ వుండింది. ఎందుకు కొడ్తున్నారని ఆయన ప్రశ్నిస్తే ఒక పోలీసు ఆయనను కొంతదూరం తీసుకు వెళ్ళి ఎడమకాలిపై కొట్టి వదిలేసాడు. సంఘం ఈ దెబ్బల గుర్తులన్నీ చూసింది.

11. కె. లింగయ్య : ఈయన ఊరి సుంకరి. పోలీస్‌పటేల్ ఆదేశం ప్రకారం ఇతన్ని నిర్బంధించారు, తీవ్రంగా హింసించారు. ఆయన మోచేతులపై మోకాళ్ళపై, చేతులపై, వీపుపై బాగా కొట్టారు. ఈ ప్రమాదకరమైన గాయాల నుంచి రక్తం కారడం మొదలైంది, ఆయన ఎక్కడున్నదీ ఇప్పటికీ తెలియదు. సంఘం ఊరికి వెళ్ళిన రోజున పోలీసులు వచ్చి ఆయన ఇంట్లో ప్రశ్నించి ఆయన భార్య దుర్గమ్మను భర్తను హాజరు పరచకపోతే నిర్బంధిస్తామని బెదిరించారు.

ఈ సంఘటన జరిగిన తర్వాత స్పెషల్ పోలీసులు ఊళ్ళో నాలుగు రోజులు మకాం చేశారు. ఉప్పరి, చాకలి, హరిజన వాడలపై మాటి మాటికీ దాడి చేయడమూ, సోదా చేయడమూ సాగించారు. వాళ్ళ పురుషులను త్వరగా హాజరు పరచకపోతే దెబ్బలు తినవల్సి వస్తుందని స్త్రీలను బెదిరించారు.

ప్రభుత్వం గ్రామస్తులను బాధించడానికి ఎన్నో క్రిమినల్ కేసుల్లో ఇరికించడం సంఘం దృష్టికి వచ్చింది. సంఘం దృష్టికి వచ్చిన కేసులు మూడు. 1. నేరం సంఖ్య 39/79, ఇది ఇరవైఎనిమిది మందిపై పెట్టారు. 2. నేరం సంఖ్య 40/79, ఇది ఇరవైఎనిమిది మందిపై పెట్టారు. 3. నేరం సంఖ్య 41/79, ఇది ముప్పై మందిపై పెట్టారు. ప్రస్తుతం ఎనభైఆరుగురు గ్రామస్తులపై విచారణ సాగుతున్నది. ఇందువల్ల గ్రామంలోని పురుషులు తమ తమ వృత్తులు కొనసాగించడానికి వీల్లేకుండా వున్నది.

దీని ఫలితంగా గ్రామ ప్రజలు డబ్బులులేని స్థితిలో ఎన్నో ఇబ్బందులతో రోజులు గడుపుతున్నారు.

ముగింపు - డిమాండ్లు.

పై వాస్తవాల ఆధారంగా; నిశితపరిశోధన అనంతరం సంఘం ఏకగ్రీవంగా ఈ క్రింది పరిశీలనకు వస్తున్నది.

1. జులై పదకొండున స్కైలాబ్ పతనం గురించి కరీంనగర్‌జిల్లా ప్రజలంతా భయపడుతూ వున్నారు. అట్లాగే రామయ్యపల్లి ప్రజలు కూడా భయంతోనూ ఆందోళనతోనూ వున్నారు. ఆ సమయంలో వాళ్ళేపని చేయడానికీ సంసిద్ధంగా లేరు. రామయ్యపల్లి లోని ఉప్పరి, చాకలి, హరిజన వాడల ప్రజలందరూ అదే పరిస్థితిలో వున్నారు. ఈ పరిస్థితిలో హరిజనులు పై సంఘటనలకు గురికావల్సి వచ్చింది.

2. ఈ మొత్తం సంఘటనని రగిలించిందీ, ప్రారంభించిందీ ఊరి దొర నర్సింహారెడ్డి, ఆయన కొడుకు. మొత్తం సంఘటనకు బాధ్యులు దొర, ఆయన కొడుకు మాత్రమే.

3. దొర తన ప్రయోజనాల రక్షణ కోసం ఇచ్చిన ఆదేశాలపై పోలీసులు ఉద్దేశ్య పూర్వకంగానే సంఘటనలో ముఖ్యపాత్ర స్వీకరించారు. ఉప్పరివాడకు రావలసిన అవసరంలేకున్నా ఉప్పరివాడకు వచ్చారు. కావలిస్తే రాజమల్లును, కొమురయ్యను నిర్బంధించి పూచీకత్తుపై విడుదల చేయవలసింది.

హరిజనులపై బలహీనవర్గాల వారిపై ఈ దేశంలో ఇది కొత్త విషయం కాదు. కంచికచెర్ల, కీలవేన్మణి, బెల్చి, చినటిగిరాల .... .... ఇంకా ఎన్నో .... వీటన్నిటి నుంచీ ఈ విషయం తెలుస్తూనే వున్నది.

4. మంథని ఇనస్పెక్టర్ ఆఫ్ పోలీస్, పెద్దపల్లి ఎఎస్‌పి వాళ్ళ హద్దులు మీరి ప్రవర్తించారు. ఇళ్ళను సోదా చేయడం, అమాయక ప్రజల ఇళ్ళ తలుపులు పగల గొట్టి దాడులు సాగించడం, ప్రజలను అనవసరంగా నిర్బంధించడం, నిర్బంధించిన ప్రజల్ని చట్టవిరుద్ధంగా కొట్టడం, రక్తం కారేట్టు కొట్టడం, తలక్రిందులుగా వేలాడ దీసి కొట్టడం.... వీటన్నిటినీ వాళ్ళు చట్టం మీరి చేశారు. చట్టపు హద్దులు దాటి ఇలాంటి చర్యలు జరుగుతున్నపుడు చట్టమూ, న్యాయమూ అమలవుతున్నదని నమ్మ శక్యం కాదు.

5. పరిస్థితి అంతటా ప్రశాంతంగా ఉన్నపుడు, అవసరం లేకపోయినప్పటికీ పోలీసులు గ్రామంలో నాలుగు రోజులు మకాంచేశారు.

6. ఇందువల్ల అమాయక హరిజన, బలహీనవర్గాల ప్రజలు చాలా మంది భయంవల్ల పారిపోయారు. గ్రామంలో స్త్రీలు మాత్రమే మిగిలారు. వాళ్ళ జీవన విధానం తీవ్ర సంక్షోభానికి లోనైంది. ఇప్పటికీ పోలీసుజీపులు రామయ్యపల్లికి ఎప్పుడూ తిరుగుతూనే వున్నాయి. ఉప్పరి, చాకలి, హరిజన వాడలకు వెళ్ళిపురుషులు హాజరు కాకపోతే భయంకర పరిణామాలు ఎదుర్కోవాల్సి వస్తుందని బెదిరిస్తున్నారు.

7. తిరుమలరెడ్డిని తీవ్రంగా హింసించడమూ, ప్రమాదకరంగా గాయ పరచడమూ, పోలీసులు ఆయనపైనే కేంద్రీకరించడమూ చూస్తే దొర తన ప్రధాన శత్రువుగా ఎంచుతున్న తిరుమలరెడ్డిని పోలీసుల సాయంతో చంపివేయ ప్రయత్నించాడని అర్థమవుతున్నది. పోలీసులు తమ హింసాకాండను ప్రజలను చంపివేయడానికో, పనికిరాకుండా చేయడానికో ఉపయోగించారని తెలుస్తున్నది. పోలీసులు దొర ఇష్టాల ప్రకారమూ, ఆదేశాల ప్రకారమూ పనిచేసారు; పూర్తిగా దొర పనిముట్లుగామారారు. సంఘం అధ్యక్షునితో మాటల్లో జిల్లాఎస్పీ "నేను ప్రజల మధ్య పోలీసుల ప్రతిష్ఠను ఉన్నతంగా నిలబెట్టదలుచుకున్నాను. అందుకనే నేను పోలీసులతో భయభీతావహాలు సృష్టించాల్సిందిగా చెప్పాను" అన్నాడు. ఈ మాటలవల్ల పాలకవర్గాల స్వప్రయోజనాల రక్షణకోసం అత్యవసరపరిస్థితి అత్యాచారాలు ఇంకా కొనసాగుతున్నాయని తెలుస్తున్నది.

సంఘటనలో పోలీసుల పాత్ర అన్యాయంగా వుందనీ, చట్టవిరుద్ధంగా వుందనీ నిర్ణయానికి రావడంలో సంఘానికి ఎలాంటి అనుమానమూ లేదు.

1. పట్వారీ నర్సింహారెడ్డినీ, పోలీస్‌పటేల్ వెంకట రాజారెడ్డినీ తక్షణమే వాళ్ళ పదవుల నుంచి తొలగించాలి. వాళ్ళపై వాళ్ళు చేసిన నేరాల గురించి క్రిమినల్ కేసులు పెట్టాలి.

2. మంథని ఇనస్పెక్టర్ ఆఫ్ పోలీస్, ఏఎస్పీలను తక్షణమే సస్పెండ్ చేసి వాళ్ళపై వాళ్ళు చేసిన దౌర్జన్యాలకు క్రిమినల్ కేసులు పెట్టాలి.

3. చట్టవిరుద్ధ సోదాలు, ఇళ్ళ తలుపులు విరగ్గొట్టడం, కొట్టడం, తీవ్ర గాయాలు కలిగించడం, చాలా మంది అమాయక ప్రజల్ని చట్టవిరుద్ధంగా నిర్బంధించడం, హింసించడం లాంటి నేరాల గురించి మంథని ఇనస్పెక్టర్ ఆఫ్ పోలీస్, పెద్దపల్లి ఏఎస్పి పెద్దపల్లి స్పెషల్ పోలీసులపై తక్షణమే క్రిమినల్ కేసులు పెట్టాలి.

## 'నీ చిందిన నెత్తురంలో ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లె'

అది 1972 ఏప్రిల్ 14 సాయంత్రం

భౌతిక శాస్త్రంలో అత్యుత్తమ మేధావి, జిజ్ఞాసాపరుడు, విప్లవ విద్యార్థి విద్యార్థినాయకుడు కామ్రేడ్ జార్జిరెడ్డిని ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆవరణలో పోలీసుల ముందు మతోన్మాద గూండాలు హత్యచేసారు.

అది 1979 జులై 18 రాత్రి

వ్యవసాయశాస్త్ర పట్టభద్రుడు, రాష్ట్ర విద్యార్థి యువజన నాయకుడు, పంజాబ్ విద్యార్థిసంఘం కార్యదర్శి, విప్లవకారుడు కామ్రేడ్ పృతిపాల్ సింగ్ రణధవాను ఇంట్లోంచి ఎత్తుకుపోయి మతోన్మాద కిరాయి గూండాలు హత్యచేసారు.

ఏడు సంవత్సరాలు-

పాలకవర్గ హంతక స్వభావంలోనూ, మతోన్మాదుల దురహంకారంలోనూ, పైశాచిక కృత్యాలలోనూ ఏమీ మార్పులేదు; ఏమీ తగ్గుదలలేదు- కాని ఏడు సంవత్సరాలు ప్రజాసామ్యవాదులకు ముఖ్యమైన సంవత్సరాలు- మానవ స్వభావంలో మార్పు వచ్చిన సంవత్సరాలు, మానవతా స్వభావంలో మార్పు వచ్చిన సంవత్సరాలు- ఈ రోజుల్లో 'మనకెందుకులే' అనుకోవడం తగ్గింది- ప్రజాస్వామ్య శక్తుల కంఠం ఎలుగెత్తి నినదించే బలాన్ని పుంజుకుంది. అందువల్లనే రణధవా హత్య పంజాబ్ రాష్ట్రాన్ని ఇప్పటికీ కుదిపివేస్తూనే వున్నది.

ఇరవై ఎనిమిది సంవత్సరాల రణధవా లూథియానాలోని పంజాబ్ వ్యవసాయ విశ్వ విద్యాలయం నుంచి ఈ మధ్యే ఎంఎస్సీ పాసయ్యాడు. ఆయన గత ఎనిమిదేళ్ళ నుంచి హత్యకు రెండు వారాల క్రితం వరకూ పంజాబ్ విద్యార్థిసంఘ కార్యదర్శి.

---

4. సాధారణ వృత్తి వ్యాపారాలలో కలిగిన అంతరాయానికీ, నివాసాలకు కలిగిన నష్టానికీ గ్రామస్థులకు నష్టపరిహారం కట్టియివ్వాలి.

5. రాష్ట్ర ప్రభుత్వం ఇప్పటికి ఎనభై ఆరుగురు గ్రామస్తులపై క్రిమినల్ కేసులు పెట్టింది. ఈ కేసులు ఉపసంహరించవలసిందిగా ప్రభుత్వాన్ని డిమాండ్ చేయమని సంఘం ఒపిడిఆర్‌ను కోరుతున్నది.

6. మొత్తం సంఘటనపై న్యాయ విచారణ సాగించాలి. పూర్వ సంఘటనలు, మంథని ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్, పోలీసులు చేసిన అత్యాచారాలు, భూస్వాములైన పట్వారీ పోలీస్‌పటేల్‌లతో వాళ్ళ కుమ్మక్కు మొదలైనవన్నీ వెలుగులోకి రావాలి.

అయన 1972-73లో జరిగిన మోగా విద్యార్థి ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించాడు. అట్లా మిలిటెంట్ విద్యార్థిగా, విప్లవ విద్యార్థిగా ఆయన ఉద్యమ జీవితం ప్రారంభమైంది. ఆ తరువాత పంజాబ్ విద్యార్థిసంఘం రాష్ట్రంలో బలమైన శక్తిగా రూపొందింది. 1965లో స్థాపించబడిన ఈ సంఘం వామపక్ష విద్యార్థి సంఘాల్లోకల్లా బలమైనది. కొద్దిరోజుల క్రితమే రణధవా పంజాబ్ విద్యార్థి సంఘానికి కన్నీళ్ళతో వీడ్కోలు చెప్పాడు. అప్పట్నుంచి 'జమ్హురి అధికార సభ'కు దీక్షగా అంకితమైపోవాలని నిర్ణయించుకున్నాడు. ఆయన యుసిసిఆర్ఐఎంఎల్‌లో క్రియాశీల కార్యకర్తగా చేరినట్లున్నాడు.

నక్సల్బరీ తరం విద్యార్థి యువజన నాయకుల్లో రణధవా మొదటి శ్రేణిలో నిలుస్తాడు. గత దశాబ్దంలో పంజాబ్‌లో జరిగిన అన్ని ప్రజాస్వామ్య పోరాటాల్లోనూ రణధవా అగ్రభాగాన నిలిచాడు. ఆయన నాయకత్వాన 1971లో పంజాబ్ విద్యార్థి సంఘం పునర్నిర్మించబడింది. చాలా కొద్దికాలంలోనే అది రాష్ట్రంలో ప్రజాస్వామిక ప్రజా సంఘాల్లో బలమైనదిగా రూపొందింది. 1971లో లూథియానా జిల్లాలోని సమరశీల విద్యార్థి కార్యకర్త జగతార్ హత్యతో దాని బలం పెరిగింది. ఈ హత్య సందర్భంగా జరిగిన శాంతియుత నిరసన ప్రదర్శనపై మోగాలో 1972 అక్టోబర్ ఐదున కాల్పులు జరిగాయి. ఈ కాల్పుల్లో చాలా మంది విద్యార్థులు, ఇతరులు మరణించారు. అప్పుడు పంజాబ్ విద్యార్థిసంఘం రాష్ట్రవ్యాపిత ఆందోళనలోనే రణధవా రాష్ట్రంలో ముఖ్య నాయకుడుగా పరిణామం చెందాడు.

1974 జయప్రకాశ్ ఉద్యమం సందర్భంగా పంజాబ్ విద్యార్థిసంఘం మోగాలో అతిపెద్ద ప్రదర్శన జరిపింది- జెపి ఉద్యమం యొక్క లొసుగులను ఎత్తి చూపుతూ అసలైన విధానాన్ని నొక్కి చెప్పింది. ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా పంజాబ్ విద్యార్థి సంఘం ఆయన నాయకత్వంలో గట్టి నిరసన తెలిపింది. ఆ సంఘానికి చెందిన 36గురు సమరశీల కార్యకర్తలు రణధవాతో సహా ఎమర్జెన్సీలో జైల్లో వుంచబడ్డారు.

నిరుద్యోగ ఉపాధ్యాయుల ఆందోళనలోనూ పంజాబ్ విద్యార్థిసంఘం ఆయన నాయకత్వంలో తమ సానుభూతినీ, మద్దతునూ ప్రకటించింది. వాళ్ళతోపాటు నిర్బంధాలు అనుభవించింది.

ఈ మధ్య జరిగిన పోలీసుల ఆందోళనలోనూ ఆయన నాయకత్వంలో పంజాబ్ విద్యార్థి సంఘం తమ ప్రగాఢసానుభూతిని ప్రకటించింది. వాళ్ళతోపాటు నిర్బంధాలు అనుభవించింది.

నిమ్నవర్గాలపట్ల, ఇతర మతాలపట్ల అకాలీదళ్ వివక్షతను, హింసావిధానాన్ని పంజాబ్ విద్యార్థిసంఘం తీవ్రంగా ఖండించింది. కొద్దిరోజుల క్రితమే పంజాబ్ విద్యార్థిసంఘానికి చెందిన ఒక ప్రాంతీయ కార్యదర్శిపై అకాలీగుండాలు హత్యా ప్రయత్నం చేశారు అప్పుడే రణధవాను చంపుతామని బెదిరించారు.

రణధవా, ఆయన సహచరులు పంజాబ్ అంతటా గూండాయిజానికి వ్యతిరేకంగా పోరాడారు. అంటే పాలకవర్గానికి, మతోన్మాదులకు వ్యతిరేకంగా పోరాడారు. తమ హంతక స్వభావానికీ, పైశాచిక కృత్యాలకూ, గూండాయిజానికీ అడుగడుగునా అడ్డుతగులుతున్న రణధవాను హత్యచేయడానికి పాలకవర్గాలూ, మతోన్మాదులూ కలిసి కుట్రపన్నారు.

జులై 18 :

పంజాబ్‌లో ప్రఖ్యాత పారిశ్రామిక నగరం లూథియానా. ఆ నగరంలో మధ్య తరగతి ప్రజలు నివసించేవాడ జవహర్ నగర్ అప్పుడే నిద్రలోకి జారుతున్నది. ఆ వాడలోవున్న ఒక డాక్టర్ దగ్గరికి ఇద్దరువ్యక్తులు స్కూటర్ పై వచ్చారు. కడుపులో నొప్పి వస్తున్నదనీ చికిత్స చేయమనీ కోరారు. కొద్దిసేపట్లోనే ఇంకో ముగ్గురు వ్యక్తులు లోపలికొచ్చారు. అ డాక్టర్ రణధవాకు మామ. ఆ సమయానికి రణధవా తన మామ దగ్గరే వున్నాడు. ఆ ముగ్గురూ రణధవాపై పడ్డారు. అక్కడ నిలబడివున్న కార్లోకి ఆయన్ని నెట్టారు. ఆ కారు వేగంగా వెళ్ళిపోయింది.

రణధవా బంధువులు, స్నేహితులు వెంటనే పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేయడానికి పోయారు. చాలా ఆలస్యంచేసి చిట్టచివరికి ఉదయం మూడు గంటలకు ఒక తెల్లకాగితంపై ఫిర్యాదు రాయించుకున్నారు. ఆ మర్నాడు - పోలీసులు కాదు - కొందరు జాండే గ్రామ ప్రజలు తమ రణధవా అక్కడికక్కడే తుపాకి పోట్లతో నగ్నంగా పడి వున్నాడని చూసి రణధవా అత్తామామలకు ఆ విషయం చెప్పారు. ఆయన శవం లూధియానాకు పదమూడు కిలోమీటర్ల దూరంలో బడోవల, జాండే గ్రామాలను కలిపే రోడ్ పక్కన, మోగా రహదారిపై పడివుంది.

విద్యార్థుల్లోవున్న రెండువర్గాల కలహం మూలంగానే రణధవా హత్యచేయబడ్డాడని, పంజాబ్ విద్యార్థి సంఘానికి వ్యతిరేకంగా పనిచేస్తున్న విద్యార్థిసంఘ నాయకుడు టీంట్ సింగ్ హంతకుడని పోలీసు కథనం.

పంజాబ్ విద్యార్థి సంఘం ఈ హత్యలో రాజకీయ ప్రమేయం వుందని నొక్కి చెప్పింది. అకాలీ నాయకులు, పోలీసు అధికారులు, సంఘ వ్యతిరేక శక్తులు కలిసి

పన్నిసక్రుట ప్రకారం, ముందే నిర్ణయించుకున్న పథకం ప్రకారం ఈ హత్య జరిగిందని ఆ సంఘ నాయకత్వం తెలిపింది.

పంజాబ్ వ్యవసాయశాఖా మంత్రి, సల్లమందు రవాణాదార్ల రాజైన లూథియానాకు చెందిన ఒక సీనియర్ అకాలీ నాయకుడు, ఇద్దరు అకాలీ శాసన సభ్యులు బీంట్ సింగ్ రక్షకులు. వీళ్ళ సహాయంతోనే బీంట్ సింగ్ వ్యవసాయ విశ్వ విద్యాలయంలో ప్రవేశించాడు. వీళ్ళ సహాయంతోనే తన గదిలో అక్రమ ఆయుధాలు దొరికినప్పటికీ ఏ కేసు లేకుండా తప్పించుకున్నాడు.

ఈ హంతకులను వెంటనే నిర్బంధించాలనీ, న్యాయవిచారణ జరిపించాలనీ రాష్ట్ర వ్యాపితంగా ఆందోళన చెలరేగింది.

'యువ నక్సలైట్ నాయకుడు ప్రీతిపాల్‌సింగ్ రణధవా హత్య పంజాబ్ విద్యార్థి యువజనవర్గాల్లో తీవ్ర ఆందోళనకు దారి తీసింది' అని ఒక పత్రిక ప్రకటించింది.

హోషియార్‌పూర్ జిల్లాలోని ఆయన స్వగ్రామం దసుయాలో జరిగిన ఆయన అంత్యక్రియలకు వందలాది స్నేహితులు, బంధువులు, విప్లవ మిత్రులు, స్థానిక రాజకీయపార్టీల ప్రతినిధులు హాజరయ్యారు. అక్కడ జరిగిన బహిరంగ సభలో ఆయన భార్య మాట్లాడింది.

మత, విప్లవ ప్రతీఘాత, రాజకీయ శక్తులు పోషిస్తున్న సంఘ వ్యతిరేక శక్తుల దుర్మార్గ చర్యల్లో ఇది ఒకటని ప్రముఖ హిందీకవి కుమార్ వికల్ సంతకం చేసిన 'అసోసియేషన్ ఫర్ డెమొక్రటిక్ రైట్స్' ప్రకటన తెలిపింది.

ఈ క్రూర హత్యను పంజాబ్ విశ్వ విద్యాలయ అధ్యాపకేతర సిబ్బంది ఖండించారు.

పంజాబ్ విద్యార్థిసంఘం నూతన కార్యదర్శి మాల్వీందర్‌సింగ్ మాహ్లి త్వరగా హంతకులను నిర్బంధించకపోతే విద్యార్థి యువజనులు రాష్ట్రాన్ని కుదిపి వేయగలరని ప్రభుత్వాన్ని హెచ్చరించాడు.

ఈ క్రూర హత్యను ఖండిస్తూ, వెంటనే న్యాయవిచారణ జరపాలని కోరుతూ భటిండాలో విద్యార్థి యువజనులు ఒక పెద్ద ప్రదర్శన జరిపారు.

రణధవాను తీసుకుపోయిన కారుకు నంబర్ బోర్డులేదని, 'అప్లైడ్ ఫర్' (దరఖాస్తు చేయబడింది) అని రాసి వున్నదని, శవం కనుగొన్న తరువాత 36 గంటల వరకు రక్తం మరకలు అట్లానే వున్నాయని తెలిసింది.

జులై ఇరవై రెండున ఇద్దరు అనుమానితులను నిర్బంధించారు. వాళ్ళు కుక్కూ-అనబడే పరమీందర్ సింగ్, గుడ్డూ అనబడే గురుజిందర్ పాల్ సింగ్. అంతకు ముందే సరంగ్‌వాల్ గ్రామానికి చెందిన ఛోటా అనబడే పరమీందర్ సింగ్‌ను నిర్బంధించారు.

ఈ కుక్కూ- దోరహాలోని కళాశాల విద్యార్థి, గుడ్డూ లూధియానాలో టెలివిజన్ మెకానిక్.

జులై ఇరవై రెండు నాటికి బీంట్ సింగ్‌తో సహా ఐదుగురు అనుమానితులు పరారీలోనే వున్నారు.

రణధవా హంతకులను వెంటనే నిర్బంధించకపోవడం పట్ల నిరసనగా గురునానక్ ఇంజనీరింగ్ కళాశాల, లూథియానా పంజాబ్ వ్యవసాయ విశ్వ విద్యాలయాల విద్యార్థులు ఇరవై మూడున ఒక బ్రహ్మాండమైన ప్రదర్శన జరిపారు. వాళ్ళు అకాలీ గుండాయిజాన్ని వ్యతిరేకిస్తూ నినదించారు. హత్యపై అత్యున్నత స్థాయి న్యాయ విచారణ జరపాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేసారు.

పంజాబ్ విశ్వావిద్యాలయంలోని చాలామంది విద్యార్థులు నల్లబ్యాడ్జీలు ధరించారు.

సెంట్రల్ పాలిటెక్నిక్ విద్యార్థులు ఒక సంతాప సమావేశాన్ని ఏర్పాటుచేసారు.

'సంగ్రూర్, ఇతర పట్టాణాల నుంచి వస్తున్న నివేదికలు రాష్ట్రంలో ప్రారంభమైన విపరీతమైన ఆందోళననూ, కోపాన్నీ తెలుపుతున్నాయి. ఆ నివేదికలు పోలీసులు తక్షణ చర్యతీసుకోకపోతే వామపక్ష విద్యార్థిసంఘాలు- నిర్మాణయుతమైన, దీర్ఘకాలిక పోరాటాన్ని చేపడతాయని తెలుపుతున్నాయి' అని ఒక పత్రికరాసింది.

ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్ పంజాబ్ కార్యవర్గం ఫరీద్ కోట జిల్లా మాలుట్‌లో సమావేశమయి ఈ క్రూర హత్యను ఖండించింది. రాష్ట్రంలో పెచ్చరిల్లుతున్న అశాంతిని అరికట్టవలసిందిగా డిమాండ్ చేసింది.

జులై ఇరవై ఐదునాటికి హత్యను ఖండించని విద్యార్థి సంఘమేదీ లేదు.

వారం రోజులపాటు ప్రతిపట్టణమూ విద్యార్థులపెద్ద ప్రదర్శనను చూసింది-

జులై పద్దెనిమిదినాటి హత్యకు పందొమ్మిదిన- లూథియానాలో మొదలైన నిరసన ప్రదర్శనలు ఇరవై ఐదునాటికి రాష్ట్రమంతా చెలరేగాయి ఇరవై ఐదునాటికి నిరసన తెల్పని విద్యార్థిలేడు- నిరసన ప్రదర్శన జరగని పట్టణం లేదు.

పోలీసు అత్యున్నత అధికారవర్గాలు ఇరవైఐదునాటికి సంగ్రూర్, పాటియాలా, భటిండా, మోగా, ఫరీద్‌కోట, అమృతసర్, జలంధర్ పట్టణాలకు సాయుధ దళాలు పోపలసిన అవసరం వుందని అనుకున్నాయి.

మొదటి ఆందోళనలో తమతో కలిసి పనిచేసినందువల్ల చిన్నస్థాయి పోలీసులు విద్యార్థులపై లాఠీచార్జి, బాష్పవాయు ప్రయోగం లాంటివి జరపరని అనుకుంటున్నారు.

ఇప్పటివరకు జరిగిన ఆందోళన అన్నింటిలోనూ పోలీసులు అల్లర్లు రాకుండా నిరోధించారు.

ఆందోళనలో స్టూడెంట్స్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా (సిపిఎం) పంజాబ్ స్టూడెంట్స్ యూనియన్ (బిక్కార్ సింగ్ వర్గం) ఆల్ ఇండియా స్టూడెంట్స్ ఫెడరేషన్ (సిపిఐ) లాంటి విద్యార్థిసంఘాలతో పాటు సిఖ్ స్టూడెంట్స్ ఫెడరేషన్ (అకాలీదళ్) నేషనల్ స్టూడెంట్స్ యూనియన్ (కాంగ్రెస్) అఖిలభారతీయ విద్యార్థిపరిషత్ (ఆర్ఎస్ఎస్)లు కూడా పాల్గొనవలసి వచ్చిందంటే రాష్ట్రంలో రణధవాకు వున్న పేరు ప్రఖ్యాతులు అర్థం చేసుకోవచ్చు.

వామపక్ష విద్యార్థి సంఘాలన్నీ ఒక సమన్వయ సంఘాన్ని ఏర్పరుచుకున్నాయి. రవాణా ఉద్యోగుల సంఘం, వివిధ ఉపాధ్యాయ సంఘాలు, విద్యుచ్ఛక్తి ఉద్యోగుల సంఘం, ప్రభుత్వ ఉద్యోగుల సంఘం తమ నిరసనను బహిరంగంగా ప్రకటించాయి. కొన్ని సంఘాలు ఆందోళనలో పాల్గొన్నాయికూడా,

ఢిల్లీ జవహర్‌లాల్‌నెహ్రూ విశ్వవిద్యాలయంలో జులై ఇరవైఐదున ఒక నిరసన సమావేశం జరిగింది. ఈ సమావేశాన్ని స్థానిక రాడికల్ స్టూడెంట్స్ సెంటర్ నిర్వహించింది. ఈ సమావేశానికి స్థానిక పియుసిఎల్ అధ్యక్షుడు గోబింద ముఖోతీ అధ్యక్షత వహించాడు. ఈ సమావేశంలో వివిధ విద్యార్థివర్గాల ప్రతినిధులు మాట్లాడారు.

ఇరవైఐదునే ఢిల్లీ విశ్వ విద్యాలయంలో వందమంది విద్యార్థులు, అధ్యాపకులు ఒక ఊరేగింపు తీసి తరువాత బహిరంగ సభ జరిపారు.

జులై ఇరవైఐదున చండీఘర్ నుంచి అన్ని ముఖ్య ఆందోళనా కేంద్రాలకు పంజాబ్ సాయుధ పోలీసు దళాలు పంపబడ్డాయి. ఈ దళాలు ఆందోళన తీవ్రంగా విస్తరించివున్న పాటియాలా, భటిండా, సంగ్రూరు, ఫరీద్‌కోట, ఫిరోజ్‌పూర్ జిల్లాలకు తరలి వెళ్ళాయి.



విద్యార్థి యువజన సంఘాలతోపాటు ఈ సమస్యని తమదిగా భావించిన అనేక సంఘాల్లో పంజాబ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు ఉద్యోగుల సంఘం, ప్రభుత్వ పాఠశాలల ఉపాధ్యాయుల సంఘం, పున్సప్‌స్టాఫ్, పంజాబీ విశ్వ విద్యాలయ అధ్యాపకేతర సిబ్బంది సంఘం, మార్క్‌ఫెడ్ ఉద్యోగుల సంఘం కొన్ని మాత్రమే.

జులై పందొమ్మిది నుంచి రాష్ట్రమంతటా సాగుతున్న ఆందోళనల్లో చివరికి జులై ఇరవై ఆరున మోగాలో లాఠీచార్జి, బాష్పవాయు ప్రయోగం జరిగాయి.

ముప్పైమంది అకాలీ శాసన సభ్యులు, ఇద్దరు మంత్రులు చండీఘర్ దగ్గరి గురుద్వారా లోగర్‌లో సమావేశమయి హంతకులను నిర్బంధించడంలో- వారికెంత పెద్దవారి సహాయమున్నప్పటికీ- త్వరిత చర్యలు తీసుకోవాలని కోరారు.

ఆగస్టు ఎనిమిదిన లూథియానాలో విద్యార్థి ప్రదర్శనపై లాఠీచార్జి జరిగింది. ఆనాడు హంతకుల నిర్బంధంలో జరుగుతున్న ఆలస్యంపట్ల నిరసన తెలుపుతూ స్థానిక ఆర్య కళాశాల, జిజిఎన్ ఖాల్సా కళాశాలల విద్యార్థులు పూర్తి సమ్మె జరిపారు.

మూడు కళాశాలలకు చెందిన రెండువేల మంది విద్యార్థులు పట్టణ ప్రధాన వీధుల్లో ఊరేగింపులు తీశారు. చివరికి స్థానిక బస్‌స్టాండ్‌లో ఆ ఊరేగింపు ప్రదర్శనగా మారింది. ఆ ప్రదర్శనలో నిరుద్యోగ ఉపాధ్యాయులు, భారత నవజవాన్ సభ సభ్యులు కలిశారు. ఈ ప్రదర్శనపై లాఠీచార్జి జరిగింది.

ఇంకా ఈ ఆందోళన చల్లారలేదు.

రణధవా జీవితచరిత్ర ముగిసింది.

విద్యార్థి ఉద్యమ చరిత్రలో రక్తాక్షరాల రచన మొదలయింది.

23-8-79

\- వేణు

## ప్రముఖుల ఖండన

"'రాజకీయ' మద్దతుతో సంఘవ్యతిరేక శక్తులు విద్యార్థి నాయకుడు ప్రీతిపాల్ సింగ్ రణధవాను క్రూరంగా, పైశాచికంగా హత్య చేయడాన్ని మేం నిస్సందేహంగా ఖండిస్తున్నాం. పంజాబ్ విద్యార్థి సంఘానికి దాదాపు ఒక దశాబ్దం ప్రధాన కార్యదర్శిగా పనిచేసిన రణధవా పంజాబ్‌లో సాగిన ప్రతి ప్రజాస్వామిక ఆందోళనలోనూ అగ్ర భాగాన నిలిచాడు. మోగాలో విద్యార్థులను చంపివేయడం పట్ల నిరసనగా 1972లో జరిగిన ఆందోళనకు ఆయన నాయకత్వం వహించాడు. ఆయన 1974 రైల్వేసమ్మెను సమర్థించాడు. ఇందిరా నియంతృత్వానికి వ్యతిరేకంగా పోరాడి, ఎమర్జెన్సీ కాలంలో మీసా కింద జైల్లో వుంచబడ్డాడు. జనతా అధికారానికొచ్చిన తరువాత జరిగిన నిరుద్యోగ ఉపాధ్యాయుల ఆందోళనలో ఆయన నాయకత్వాన పంజాబ్ విద్యార్థి సంఘం పాల్గొన్నది. మైనారిటీ వర్గాలపట్ల అకాలీల నిరంకుశత్వాన్ని తీవ్రంగా ఎదుర్కొన్నది. ఈ మధ్య జరిగిన పోలీసుల ఆందోళనకు గట్టి మద్దతు ఇచ్చింది. ఆయన విద్యా విషయంగా కూడా ప్రజ్ఞావంతుడు. ఆయనను 'పంజాబ్ ట్రిబ్యూన్' పత్రికా సంపాదకుడు 'ఒక ముఖ్యమైన, గౌరవనీయమైన, సున్నితమైన వ్యక్తి' అని అభి వర్ణించాడు. నైతిక, బౌద్ధిక, ఆచరణాత్మకమైన అరుదైన వ్యక్తిత్వం ఆయనలో మనకు కనిపిస్తుంది.

అన్ని పత్రికలూ హత్యలో కొన్ని రాజకీయ శక్తుల ప్రమేయాన్ని తెలియ జేశాయి. పంజాబ్ ప్రజల, విద్యార్థుల ప్రియతమ నాయకుని జీవితం కాపాడడంలో పోలీసుల అలసత్వాన్ని తెలియజేశాయి.

ప్రజాస్వామిక ఉద్యమాలపై ఫాసిస్టు శక్తుల ప్రమాదం పెరగడాన్ని మేం తీవ్రంగా గర్హిస్తున్నాం. సంఘటనపై కేంద్రప్రభుత్వ విచారణ జరగాలనీ, హంతకులను తక్షణమే శిక్షించాలనీ మేం డిమాండ్ చేస్తున్నాం."

సంతకం చేసిన వారిలో కొందరు—

శానో షైజా (ఎం.పి), ఆర్. రౌతమా, గోవింద ముఖోతీ– ఢిల్లీ పియుసిఎల్ అధ్యక్షుడు, బిపిన్ చంద్ర, రోమిలా థాపర్, హర్‌బన్స్ ముఖియా, అమిత్ భాదురి, కృష్ణా భరద్వాజ్, ప్రభాత్ పట్నాయక్, ఉత్సా పట్నాయక్, మూనిస్ రాజా, మహమ్మద్ హసన్, నామ్‌రాగ్ సింగ్, అశ్విన్.కె.రే, సుమన్ గుప్తా, శీలా భల్లా, జి.పి. దేశ్‌పాండే, డేవిడ్ థామస్.

చమన్‌లాల్ ప్రభాకర్ విడుదల చేసిన పై ప్రకటనపై జెఎన్‌యు, ఐఐటి ఢిల్లీలకు చెందిన 500 మంది విద్యార్థులు, ఉద్యోగులు, మేధావులు సంతకం చేశారు.

(ఆగస్టు 11 ఫ్రాంటియర్ నుంచి)

మార్క్స్‌దృష్టిలో సాహిత్యం అనే పరిశీలనా పద్ధతి సక్రమం కాదు. మార్క్సిజం దృక్పథంలో సాహిత్యం అని పరిశీలనా పద్ధతివుండాలి. మార్క్స్‌దృష్టిలో సాహిత్యం అనే ఆలోచన అట్టడుగున వ్యక్తి ప్రతిభా ప్రాధాన్య భావన వుంది. మార్క్సిజం నుంచి మార్క్స్‌ని విడదీయటం అసంగతం. మార్క్స్ అభిప్రాయాల్ని కూడా మార్క్సిస్టు మూలసూత్రాల నుంచే పరిశీలన చేయాలి. మార్క్స్‌కి అనేక వ్యక్తిగత అభిరుచులు వుండొచ్చు. అవన్నీ మార్క్సిజంలో భాగం కావు. మార్క్స్‌కి చేపలు తినటం ఇష్టంఅయితే మార్క్సిస్టులందరికీ చేపలు ఇష్టంకావాల్సిన అవసరం లేదు. అలాగే మార్క్సిజం మార్క్స్‌తోనే ఆగిపోదు, ఆగిపోలేదు. కాబట్టి మార్క్స్‌దృష్టిలో సాహిత్యం అని కాక మార్క్సిజం దృష్టిలో సాహిత్యం అనే పద్ధతిలో పరిశీలించటమే శాస్త్రీయమైన పద్ధతి.

## చారిత్రిక భౌతికవాదం - మూలసూత్రాలు

"క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఇకానమీ" అనే గ్రంథ ఉపోద్ఘాతంలో మార్క్స్ స్థూలంగా చారిత్రిక భౌతికవాద మూలసూత్రాల్ని ప్రతిపాదించాడు. విప్లవాన్ని నిర్ణయించేది ఏది? అని చెప్పటం ఇక్కడ ప్రధానవిషయం కాదు. ఈ ప్రపంచ ప్రసిద్ధ ఉపోద్ఘాతంలో 1) నిర్దిష్టదశలోని ఉత్పత్తి శక్తులకి అనుగుణ్యంగా ఉత్పత్తి సంబధాలు వుంటాయి. 2) మానవుల భౌతిక వాస్తవికత వాళ్ళచైతన్యాన్ని నిర్ణయిస్తుంది. 3) ఆర్థిక వ్యవస్థ ఉపరితల నిర్మాణాన్ని నిర్ణయిస్తుంది, నియతం చేస్తుంది. అనే చారిత్రిక భౌతిక గతితర్క సూత్రాల్ని మార్క్స్ ప్రతిపాదించాడు. ఇవన్నీ పరస్పరం కలిసే వుంటాయనీ, చలన, మార్పుసూత్రాలకి అధీనంగా వుంటాయనీ మార్క్స్ వివరణలోనే అంతర్లీనంగా వుంది. ఉపరితలంలో ఉత్పత్తి శక్తులకీ ఉత్పత్తి సంబంధాలకీ ఘర్షణ వ్యక్తమవు తుందనటంలో చరిత్ర పురోగమన సూత్రమైన వర్గపోరాటాన్ని గురించి కూడా ప్రస్తావించాడు. ఆత్మ, భావం, మహాపురుషులు చరిత్రనిర్మాతలనే చారిత్రిక భావవాదాన్ని ఖండించి, చారిత్రిక భౌతిక వాదాన్ని స్థాపించటం ఈ ఉపోద్ఘాత సారాంశం. చారిత్రిక భౌతికవాదం అంటే చరిత్రని ఆర్థికంగానో, సామాజికంగానో సాధారణ వ్యాఖ్య చేయటంకాదు. ప్రత్యేక చారిత్రిక యుగాల్ని ప్రత్యేక సామాజిక నిర్మాణాల పరంగా విశ్లేషించాలి. ఈ చారిత్రిక భౌతికవాద అవగాహన పాతకాలపు చరిత్రనిశాస్త్రీయంగా అర్థంచేసుకోటానికి మాత్రమేకాదు ప్రస్తుత చరిత్రని మార్చటానికి, ప్రస్తుతానికి అన్వయించనిదీ, మార్పుకి ఆయుధం కానిదీ శాస్త్రం కాదు. చరిత్ర గతికి ఆర్థికపునాది మూలకారణంగా వివరించిన మార్క్స్ అభిప్రాయాల్ని

ఆర్థిక నిర్ణాయక వాదంగా కొందరు ప్రచారం చేస్తున్నప్పుడు అలాంటివాళ్ళకి సమాధానంగా ఎంగెల్స్ ఈ వివరణ ఇచ్చాడు. ఆర్థికవ్యవస్థ ఒక్కటే విప్లవాన్ని నిర్ణయించదు అని చెప్పటానికి ప్రమాణంగా సుదర్శనం కోట్‌చేసిన 1890 లోని ఎంగెల్స్ లేఖ 21-9-1890 న జె. బ్లాక్ (J. Block) కిరాసింది. దీన్ని మూలంచూసి, సందర్భంతో అన్వయించుకొని తానుగా అర్థం చేసుకున్న తర్వాత ఇవ్వలేదు. మార్క్సిజం అండ్ లిటరేచర్ అనే పుస్తకంలో దొరికితే ఇచ్చాడు. ఈ ఎంగెల్స్ వాక్యాల్ని వివరిస్తూ ఒక గ్రంథమే రాయవచ్చు. సందర్భం తెలీకపోవటం వల్ల దీన్ని అవగాహన చేసుకోవటంలో సుదర్శనం తప్పటడుగు వేశాడు. ఇందులోనూ ఎంగెల్స్ ఆర్థికం ఉపరితలానికి ప్రధాన, అంతిమ (Primary and Ultimate) కారణం అనే చెప్పాడు. ఆర్థిక పునాదికీ, ఉపరితలానికీ అన్యోన్య క్రియనూ, అంతర అన్యోన్య సంబంధాన్ని గుర్తించని యాంత్రిక, క్షుద్ర భౌతికవాదులకి ఇది గతితార్కిక భౌతికవాద పరమైన సమాధానం, వివరణ. ఎంగెల్స్ వివరణలోని ప్రధాన అంశాలు. 1) చరిత్ర పురోగమనానికి చారిత్రిక భౌతికవాద గతితర్కం దృష్టిలో ఆర్థిక పునాది ప్రధాన, అంతిమ కారణం. ఆర్థిక అంశం మాత్రమే నిర్ణాయక శక్తి కాదు. 2) చరిత్రలో ఉపరితలానికి కూడా క్రియాశీల పాత్రవుంటుంది. ఆర్థిక పునాది మీద ఉపరితలం ప్రభావం చేస్తుంది. ఉపరితలంలోని విభిన్న అంశాలూ, విప్లవంలో నిమగ్నమైన వాళ్ళ మెదళ్ళలోని అనేక వాస్తవ పోరాటాల ప్రతిబింబం చారిత్రిక పోరాటాల గమనం మీద ప్రభావం చేస్తాయి. ఇవి ప్రధానంగా చారిత్రిక పోరాటాల రూపాన్ని (Form) నిర్ణయించటంలో ప్రబలంగా పనిచేస్తాయి. అంతేకాని సుదర్శనం చెప్పినట్టు "స్వరూపాన్ని" కాదు. 3) ఆర్థిక పునాదికీ, ఉపరితలానికీ, ఉపరితలంలో విభిన్న శాఖలకీ మధ్య అన్యోన్యచర్య (Interaction) వుంటుంది. కొన్ని సందర్భాల్లో వాటి అంతర అన్యోన్య సంబంధం మనం విశ్లేషించ లేసంత అస్పష్టంగానూ, సూక్ష్మంగానూ వుంటుంది. అంతిమంగా ఆర్థిక ఉద్యమం (చలనం) తన అవశ్యకతని నిరూపించుకుంటుంది. జ్ఞాన సంపాదన మీద భావవాదుల అభిప్రాయాల్ని నిరాకరించటం కూడా ఎంగెల్స్ లక్ష్యం. ఆర్థిక పునాది చరిత్ర పురోగమనానికి ప్రధాన కారణం అంటే దాన్ని 2+2=4 అనే నిశ్చిత, శాశ్వత జడాత్మక సూత్రంగా ఇంకా ఆ విషయంలో మన ప్రమేయం ఏమీలేనట్టూ అవగాహనచేసుకునే భావవాదులకి ఇది సమాధానం. ప్రకృతి చలన సూత్రాల్ని వివరించినంత స్పష్టంగా వివరించ లేకపోయినా, చరిత్ర క్రమ చలన సూత్రాలు కూడా అలాంటివే. మొత్తం చరిత్ర గమనానికి ఆర్థికపునాదని కారణంగా స్పష్టంగానే నిరూపించవచ్చును. చారిత్రిక ఘటనలన్నిటికీ ఆర్థికకారణం

స్పష్టంగా కనిపించక పోవచ్చును. చారిత్రిక పోరాటాల సారాంశం ఆర్థికమే. రూపాన్ని నిర్ణయించటంలో ఉపరితల అంశాలకి కూడా ప్రబల స్థానం వుంది,

అందుకనే ఇదే ఉత్తరంలో ఎంగెల్స్ ఇలా రాసాడు "ఇంతే కాకుండా ఈ సిద్ధాంతాన్ని దీని మూలాధారాల నుంచి అధ్యయనం చేయమనీ, సెకండ్ హ్యాండ్ సమాచారం నుంచి అధ్యయనం చేయవద్దనీ నీకు చెప్పదలిచాను"1 సుదర్శనం చారిత్రిక భౌతికవాదాన్నే కాదు, ఎంగెల్స్ వాక్యాల్నీ, మార్క్స్ వాక్యాల్నీ కూడా సెకండ్ హ్యాండ్ నుంచి కోట్ చేయటం, వాటిని వక్రీకరించటం కూడా చేశాడు. ఇంతకీ ఇక్కడ ఎంగెల్స్ చారిత్రిక భౌతిక గతితర్కాన్ని గురించి వివరిస్తున్నాడు కానీ సుదర్శనం భావించినట్టు విప్లవానికి ఏది ప్రధాన కారణం అని కాదు. సందర్భం తెలీకుండా, గతితార్కిక జ్ఞానం లేకుండా మార్క్సిజం బోధించటానికి పూనుకోవటం అవివేకం.

## విప్లవరాజకీయాలు - సాహిత్యం

ఉత్పత్తి శక్తులకి ఉత్పత్తి సంబంధాలు సంకెళ్ళుగా మారినప్పుడు సామాజిక విప్లవం వస్తుందనేది స్థూల ప్రతిపాదన మాత్రమే. విప్లవానికి ప్రత్యేక విషయాలు అనేకం వుండాలి. విప్లవ పరిస్థితి వున్నంత మాత్రాన దానంతటదే విప్లవంరాదు "సాధారణంగా విప్లవం రాజకీయ చర్య. విప్లవం లేకుండా సోషలిజంరాదు"2 విప్లవానికి ఆర్థికం పునాది. కానీ విప్లవం రాజకీయ చర్య. విప్లవం రాజకీయ జీవులైన వ్యక్తులుచేసే వర్గ యుద్ధం. విప్లవవర్గం, విప్లవపార్టీ, విప్లవ సిద్ధాంతం లేకుండా విప్లవంరాదు. విప్లవమే రాజకీయమైనప్పుడు సుదర్శనం విప్లవంలో రాజకీయాలకేప్రధాన పాత్రవున్నదనటంలో అర్థం ఏమిటి? సాహిత్యం విప్లవానికి దోహదం చేయగలుగుతుంది కానీవిప్లవానికి కారణం కాలేదు. విప్లవపార్టీకి సాహిత్య, సాంస్కృతికరంగంలో విప్లవపంథావుంటుంది. విప్లవాన్ని సమర్థించే రచయితలు విప్లవ రాజకీయాల ఆధిపత్యాన్ని అంగీకరించితీరాలి. మార్క్సిస్టుల దృష్టిలో రాజకీయాల ఆధిపత్యం అంటే చాలా మందికి సరైన అవగాహన వున్నట్టు లేదు. మనిషికీ వస్తువులకీ మధ్య సంబంధంలో మనిషికి మొదటి స్థానం ఇవ్వటం రాజకీయాలకీ శ్రమకీ మధ్య సంబంధంలో రాజకీయాలకి మొదటి స్థానం ఇవ్వటం రాజకీయ ఆధిపత్యం. రాజకీయవాదికి ఒకబుర్ర సాహిత్యవేత్తకి ఒకబుర్ర వుండవు రాజకీయవాదికే కాదు ఎవరికీ "దివ్యదృష్టి" వుండదు. రచయిత అయినా మరొకడయినా విప్లవార్థతని ఆచరణలో నిరూపించుకోవాలి. విప్లవం కావాలి, రాజకీయాలు వద్దు అంటే విప్లవం వద్దు అనే అర్థం. సుదర్శనం మార్క్సిస్టు విప్లవ సిద్ధాంతం గురించి తెలీకుండా విప్లవాన్ని గురించి వల్లించటం ఎందుకు ?

## ఐడియాలజీ అంటే....

Ideology అనే మాటని తెలుగులో సిద్ధాంతం అనీ భావజాలం అనీ అనువదిస్తున్నారు. సుదర్శనం 'కవిల కట్ట' అని అనువాదం చేశాడు. కరణాలు రాసే చిట్టాల్నీ, చిత్రగుప్తుడి చిట్టానీ కవిల కట్ట అంటారు. మార్క్స్, ఎంగెల్స్‌లు ideology అంటే భ్రమాజనిత భావాలు అనే అర్థంలో వాడారు. లెనిన్, స్టాలిన్‌లు 'శాస్త్రీయమైన భావాలు' అనే అర్థంలో కూడా వాడారు. ఇప్పుడు మనం ప్రాపంచిక దృక్పథం అనే అర్థంలో వాడుతున్నాం. కవిల కట్ట అనడం మతిచెడిన వ్యవహారం. మార్క్సిస్టు తాత్త్విక సూత్రాలకీ, సాహిత్యానికీ అభేదం చెప్పటం మార్క్సిజానికి విరుద్ధంకాదు. మార్క్సిజం సామాజిక విప్లవ సిద్ధాంతం; కార్మికవర్గ ప్రాపంచిక దృక్పథం. ఈ సిద్ధాంతాన్ని ముక్కలుగా విడగొట్టడం కుదరదు. సైద్ధాంతికంగా గతి తార్కిక పద్ధతిలోనూ, ఆచరణాత్మకంగా విప్లవ మార్గంలోనూ అవగాహన చేసుకుంటే జ్ఞానరంగాల్ని విడి విడిగా చూడటం, స్వతంత్ర ప్రతిపత్తి గల రంగాలుగా పరిగణించటం, విప్లవ కార్యాచరణకి అన్వయం లేకుండా, కేవల మానసిక విషయాలుగా చూడటం మార్క్సిజానికి విరుద్ధం అని గ్రహించవచ్చును. సాహిత్యం స్వతంత్ర ప్రతిపత్తిగల రంగంగా భ్రమ కలిగించవచ్చును. కానీ ఒక నిర్దిష్టదశలోని సమాజంలో భాగంగా వుండి, ఒక దశలోని వ్యక్తుల్తో సంబంధం వుండటం వల్లనే రచయిత రచన చేయగలుగుతున్నాడు. సాహిత్యంకానీ, తత్త్వశాస్త్రం కానీ వాస్తవ ప్రపంచానికి అవతల వుండవు. "శ్రమ జీవుల చేతుల్తో రైల్వేలను నిర్మింప చేసే శక్తే తత్త్వవేత్తల బుర్రల్లో తాత్త్విక సిద్ధాంతాల్ని నిర్మింపచేస్తుంది. పొట్టలో లేనంత మాత్రాన మెదడు మనిషికి బాహ్యంగా లేనట్టుగానే తత్త్వశాస్త్రం కూడా ప్రపంచానికి బాహ్యంగా అస్తిత్వంలో వుండదు."[3] సౌరమండలాది విశ్వక్రమాన్నీ, భూమి క్రమాన్నీ జీవరాసుల, మానవ పరిణామాన్నీ, సమాజ పురోగమన క్రమాన్నీ ఒక మొత్తంగా ప్రతిబింబించుకోలేకపోతే పిడివాద సిద్ధాంతాలూ, పాక్షిక సత్యాలే తప్ప వేరే గతి వుండదు. అధ్యయనంలో, ప్రయోగాలకీ, ఆచరణకీ సిద్ధాంత రూపం ఇచ్చే ప్రయత్నంలోనూ జ్ఞానంలో వివిధ క్షేత్రాల్ని ఏర్పరచుకుంటాం. క్షేత్ర పరిమితలు జ్ఞానాన్ని పరిమితం చేయకుండా చూసుకోవాలి.

సాహిత్యమూ, మార్క్సిస్టు తాత్త్విక సూత్రాలూ ఒకటే అన్నందుకా ఎంగెల్స్ "తొత్తు కవిత్వం రాసిన చిల్లర రచయితల్ని" నిరసించింది? ఇంతకీ ఎంగెల్స్ నిరసించిన ఆ చిల్లర రచయితలు ఎవరు? ఎవరినిఉద్దేశించి, ఏ సందర్భంలో ఎంగెల్స్

అన్న మాటలివి? ఎంగెల్స్ అన్నాడంటూ తెలుగు అనువాద రూపంలో నాలుగు వాక్యాలు రాసి నెంబరు ఇచ్చి ఇంగ్లీషు మూలం సుదర్శనం ఎందుకు ఇవ్వలేదు? ఎందుకంటే జనాన్ని వంచించటానికి: పరమనీచమైన వక్రీకరణ చేయటానికి: సుదర్శనం ఇవ్వకుండా మానేసిన ఎంగెల్స్ వాక్యాలివి.

"ఫ్రాన్స్‌లోని 1830 జులై విప్లవ సంఘటనలతో జర్మనీ, బెల్జియం, పోలెండ్, ఇటలీ మొదలైన యూరప్‌లో అంతటా వ్యాపించిన రాజకీయ ఉద్రిక్త వాతావరణం జర్మన్ సాహిత్యం మీద గూడా తీవ్రప్రభావం చేసింది. ఈ కాలంలోని జర్మన్ రచయితలు పచ్చిగా రాజ్యాంగ పరిమిత వాదాన్నీ (Constitutionalism) అంతకంటే మొరటుగా ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వ వాదాన్నీ (Republicanism) బోధించారు. రచనా నైపుణ్యం అలవడని అధమ పండితులు, తమ నైపుణ్య దారిద్ర్యాన్ని కప్పిపుచ్చుకుంటూ, జనాన్ని ఆకర్షించటానికి తమ రచనల్ని రాజకీయ గుడ్డివాటు భావాల్తో నింపటం అలవాటు చేసుకున్నారు. కవిత్వం, నవలలూ, సమీక్షలూ, నాటకాలూ దాదాపు అన్ని సాహిత్య ప్రక్రియలూ గాలివాటు భావాల్తో నింపివేసేవారు. గాలివాటు రచనలంటే పరమ పిరికి తనంతో ప్రభుత్వ వ్యతిరేకతని ప్రదర్శించి జనాన్ని ఆకర్షించుకోటానికి ప్రయత్నించే రచనలు. 1830కో జర్మనీలో ప్రబలంగా వుండిన భావగందర గోళాన్ని పూర్తి చేయటానికా అన్నట్టు ఈ రాజకీయ ప్రతిపక్ష భావాలతో, సరిగ్గా జీర్ణంకాని జర్మన్ తత్త్వశాస్త్రానికి సంబంధించిన విశ్వవిద్యాలయ జ్ఞాపకాలూ, ఫ్రెంచి సోషలిజం నుంచీ, ముఖ్యంగా సెయింట్ - సయిమనిజం నుంచీ అపార్థం చేసుకొని పోగుచేసుకున్న విషయాలూ కలిసిపోయాయి. ఈ సంకర భావాల్ని అధిక ప్రసంగాల్తో విస్తృతం చేసిన రచయితల ముఠా దుష్టమైన అహంకారంతో "యంగ్ జర్మనీ" అనీ "మోడరన్‌స్కూలు" అనీ పేరుపెట్టుకొని వూరేగారు. వీళ్ళు కుర్ర చేష్టల వల్ల చేసిన తప్పులకి పశ్చాత్తాపం పొందినా తమ రచనారీతుల్ని అభివృద్ధి చేసుకోలేకపోయారు"4. ఇవి ఎంగెల్స్ వ్యాసాల్లో ప్రసిద్ధమైన "జర్మనీలో విప్లవం, ప్రతీఘాతుక విప్లవం" అనే వ్యాసంలోని వాక్యాలు. ఆనాటి జర్మనీలో వర్గసంబంధాల్ని విశ్లేషించాడు. సాయుధ తిరుగుబాటును గురించి, ప్రజావిప్లవ స్వరూపాన్ని గురించి ఈ వ్యాసంలోనే ఎంగెల్స్ మొదటి సారిగా స్పష్టంగా చెప్పాడు. ఊగిసలాడి, భయపడిపోయి, పార్లమెంటరీ సంస్థల్ని నమ్ముకున్న పెటీబూర్జువాలను గురించి చెపుతున్న సందర్భం. రాజకీయాల్ని వృత్తిగా చేసుకుబతికేవాళ్ళనీ నామమాత్రంగా ప్రతిపక్షంలో వుంటూ ఉపన్యాసాల్ని దంచే వాచాలురినీ, మాటలకి వాస్తవఅర్థాలు

తెలీకుండా వాడటానికి అలవాటుపడ్డ ప్రొఫెసర్లనూ విమర్శిస్తూ రచయితలను గురించి రాసిన సందర్భం ఇది. ఇక్కడ ఎంగెల్స్ విమర్శకు గురియైన రచయితలు మార్క్సిస్టులు కారు. మార్క్సిస్టు మూలసూత్రాలూ సాహిత్యమూ ఒకటే అని వాదించినవాళ్ళూ కాదు. అవకాశవాదులు, యథాతథవాదులు, నానారకాల పేర్లతో ప్రభుత్వానికి పరోక్షంగా వూడిగం చేసేవాళ్ళు, భావదరిద్రులూ ఈ రచయితలు. జనాన్ని ఆకర్షించటానికీ, తమ భజన పరుల్ని తయారుచేసుకోటానికీ, ప్రభుత్వ వ్యతిరేకరూపంలో ప్రభుత్వ అనుకూల రాజకీయాల్ని బోధించే తుక్కు రచయితల్ని ఎంగెల్స్ విమర్శించాడు. నిజానికి ఎంగెల్స్ విమర్శలోని కొన్ని వాక్యాలు సుదర్శనం లాంటి వాళ్ళకి అన్వయిస్తాయి. వాస్తవం ఇలావుంటే సుదర్శనం ప్రస్తుతం తెలుగులో విప్లవ, అభ్యుదయ రచనలు చేస్తున్న యువ రచయితల్ని తిట్టటానికి ఎంగెల్స్ వాక్యాల్ని ఉపయోగించటానికి ప్రయత్నించటం నిజాయితీలేని సాహిత్య వంచన కాదా? మేధావి, తత్త్వవేత్త, రచయిత, విమర్శకుడు అనే పెద్ద పెద్ద పేర్లపూరేగుతూ ఈ దొంగ తనం ఏమిటి? ప్రాథమిక చిత్తశుద్ధి వున్నవాడు చేసేపనే నా ఇది? ఇది ప్రజాద్రోహులైన సాహిత్య అషాఢ భూతుల లక్షణం.

నవలల్లో కథల్లో సిద్ధాంతాల్ని పలించటానికి సౌలభ్యం వుంది. విప్లవ రచయితల్ని సోషలిజం పలిస్తున్నారనటం తేలిక. బూర్జువా కవుల్లాగా విప్లవ కవులు మధుర రచనల్నీ, పాషాణపాక రచనల్నీ చేయటానికి అవకాశంలేదు. ప్రజాభిప్రాయాన్ని పోరాటానికి సుముఖం చేయటానికి ప్రచార స్థాయిలో నినాద కవిత్వానికీ స్థానం వుంది. ఎంత "కవిత్వ విలువలు" వున్నా పాలక వర్గాన్ని సమర్థిస్తూ రాసే కవులు తొత్తుకవులే. కాకపోతే వాళ్ళు చిల్లర కవులు కాదు, టెక్కుల కవులు. మార్క్స్ సమకాలిక రచయితల్లో, పూర్వ రచయితల్లో అభ్యుదయ ధోరణి వున్నప్పుడు అభినందించాడు. లేనప్పుడు నిరాకరించాడు. షెల్లీని విప్లవ భావాలు గల కవిగా అభినందించి, బైరన్‌ను అభ్యుదయ వ్యతిరేక కవిగా నిరసించిన మార్క్స్ కొటేషన్ సుదర్శనానికి దొరికి వుండదు. మార్క్స్‌నాటి అభ్యుదయం ఈనాటికీ అభ్యుదయం కాదు. సమాజ పురోగమన దశని బట్టి ఏది అభ్యుదయం? అనే విషయాన్ని నిర్ణయించుకోవడం జరుగుతుంది. మార్క్సిస్టు దృక్పథానికి కీలకమైన చారిత్రిక భౌతికవాద దృష్టిలేకుండా వక్రీకరణల్తో సుదర్శనం చక్రబంధ నాట్యం చేస్తున్నాడు.

## సాహిత్యంలో నిబద్ధత

రచయిత యొక్క నిబద్ధతని గురించిన అవగాహన సాత్రి కొటేషన్ నుంచి సుదర్శనం పొందగలడేమోకాని అందరికీ సాధ్యంకాదు. సాత్రి చపల చిత్తుడు. నిబద్ధత అంటే సాహిత్యానికి నిబద్దుడు కావటంకాదు. ప్రజా వ్యతిరేకమైన సిద్ధాంతాలకీ, అభిప్రాయాలకీ సామాజిక వాస్తవికతలో మూలాలు వుంటాయి. ఆ వాస్తవికతను నిర్మూలించినప్పుడే ఆ సిద్ధాంతాలు నిర్మూలించబడతాయి. ఈ దృష్టితో ప్రజల విప్లవ కార్యాచరణలో భాగంగానే సాహిత్య రంగంలో వర్గ పోరాటం చేయటం సాహిత్యంలో నిబద్ధత. రచనతో బాటు రచయిత కూడా విప్లవోద్యమంలో భాగస్వామి కావటం నిబద్ధతకి ప్రధాన లక్షణం. అంటే రచనలో విప్లవ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ రచయిత వ్యక్తిగత జీవితంలో అస్తిత్వ వాదాన్ని అవలంబించటం నిబద్ధత కాదు. మార్క్స్ అభిప్రాయాలు కూడా ఆచరణలో సవరింపబడవచ్చును. ఎవరి అభిప్రాయాలకయినా ఆచరణ గీటురాయి. లెనిన్, స్టాలిన్, మావోలు, వాళ్ల నాయకత్వంలో వున్న ప్రజలు మార్క్సిస్టు మూల సూత్రాలను ఆచరణలో నిరూపించి మార్క్సిజాన్ని సంపన్నం చేశారు. శాస్త్ర స్థాయిని సమకూర్చారు. వీళ్ళు తప్పులే చేయలేదా అంటే తప్పులు చేయనివాడు వుండటానికి అవకాశం లేదు. సుదర్శనం చెపుతున్న సోవియట్ శవ రచయితలు స్టాలిన్ తప్పులు చేస్తుంటే తాము ఏమి చేశారు? ప్రాణాలకి తెగించి అయినా సరే తాను తప్పు అనుకున్నది తప్పు అని చెప్పలేనివాడు రచయిత ఎలా అవుతాడు? ఇంతకీ సుదర్శనం 1966లోని ఆ సోవియట్ రచయితలు ఎవరు ఎక్కడ ఏమన్నారో కొటేషన్ ఇవ్వలేదు. పుస్తకం పేరు కూడా చెప్పలేదు. ఎంగెల్స్ అన్నాడంటే కష్టపడి ఎంగెల్స్ రచనలన్నీ తిరగేసి వెతకవచ్చు. "1966లో సోవియట్ రచయితలు" అంటే ఎవడికయినా సాధ్యమా పరిశీలించటానికి? విమర్శనా పద్ధతి ఇదేనా? అయితే సుదర్శనం ప్రముఖ రచయిత కాబట్టి, బహురూప రచనలు చేస్తూవుంటాడు. ప్రతి పత్రికలోనూ ఆ పత్రిక ఆశయాలకి అనుగుణ్యంగా అవతారం ఎత్తుతూ వుంటాడు. సాత్రి నుంచి జిల్లేళ్ళమూడి అమ్మ (ఈ మధ్య ఈమెకు ప్రతిష్ఠ తగ్గినట్టు వుంది) వరకు ఇందిరా ధనరాజ్‌గిరి, శేషేంద్రశర్మ, విశ్వనాధల నుంచి "శ్రీదాదాజీ" అమియరాయ చౌధురి వరకూ కుప్పిగంతులేస్తుంటాడు. ఈ1966సోవియట్ రచయితల్ని గురించి సుదర్శనం ఆర్. ఎస్. ఎస్. పత్రిక 'జాగృతి' దీపావళి సంచికలో ప్రస్తావించాడు. వాళ్ళు రాసిన పుస్తకం "Man and Society" ఈ గ్రంథంలో వున్న అభిప్రాయాల్ని ఉటంకించి రచయితల మీద పార్టీనిరంకుశాధికారాన్ని, రచయిత

బుర్గిని రాజకీయవాదికి తాకట్టు పెట్టటానికి అంగీకరించారనీ వక్రీకరిస్తూ ఆ సోవియట్ రచయితల్ని తిట్టాడు సుదర్శనం. అంటే జాగృతి పత్రికలో కమ్యూనిస్టులు సాహిత్య సృజనను హత్యచేస్తున్నారని చెప్పటానికి ప్రమాణంగా సోవియట్ రచయితల్ని కోట్‌చేసి ఖండించాడు. ఈ వ్యాసంలో స్టాలిన్ కాలంలో "వ్యక్తిపూజ" వలన కలిగిన దుష్ఫలితాల్ని చెప్పటానికి ప్రమాణంగా ఆ రచయితల్నే ఉపయోగించుకున్నాడు. సాహిత్యం ఎలా వుండాలి అనే ప్రశ్నకి సమాధానం, సాహిత్యం ఎవరి కోసం అనే ప్రశ్నకి ఇచ్చే సమాధానంలో వుంటుంది. ఒక రచన ప్రజలకి మేలు చేసేదా కాదా అని నిర్ణయించే హక్కు విప్లవ పార్టీకీ, విప్లవ రాజకీయ కార్యకర్తకీ తప్పని సరిగా వుంటుంది. నిరక్షర కుక్షులైన బూర్జువా రాజకీయ వాదులకీ, విప్లవ రాజకీయ కార్యకర్తలకీ తేడాని సుదర్శనం గమనించలేక పోవటానికి కారణం మార్క్సిజం తెలియక పోవటమే. ప్రముఖ విప్లవకారులందరూ విప్లవ రచయితలే. విప్లవ సాహిత్య అభిమానులే. మొత్తం సమాజం అనేది ఎక్కడా వుండదు. నిర్దిష్టదశలో, నిర్దిష్ట వర్గ సంబంధాలుగల, నిర్దిష్ట సమాజం వుంటుంది. చరిత్ర న్యాయమూర్తి. తీర్పును అమలు పరిచేది కార్మికవర్గం.

## మానవవ్యక్తి

మార్క్సిస్టు రాజకీయ వాదుల వక్రభాష్యాల నుంచి గతితార్కిక భౌతిక వాదాన్ని రక్షించటానికి సుదర్శనం పూనుకున్నాడు. వ్యక్తి, సమాజం, వ్యక్తి చైతన్యం, సామాజిక చైతన్యం, సమగ్రమానవుడు, సామూహిక మానవుడు, భావస్వాతంత్ర్యం, సృజనవంటి విషయాల్ని గతితార్కిక భౌతికవాద పరంగా విశ్లేషించటానికి సుదర్శనం ప్రయత్నంచేశాడు. మార్క్స్ తత్త్వశాస్త్రం గతితార్కిక భౌతికవాదం అని సుదర్శనం గుర్తించాడు. అలా గుర్తించినంత మాత్రాన్నే ఎవడూ గతితార్కిక భౌతికవాది కాడు. వివరణలో, విశ్లేషణలో, వ్యవహారంలో గతితార్కికుడుగా వుండాలి. సమాజంలో ఇతరులకి భిన్నంగా ఒక వ్యక్తికి, రచయిత కయినాసరే నిర్దిష్టమైన ప్రతిపత్తిని మార్క్సిజం అంగీకరించదు. 'వ్యక్తి' అనే ఏకాకిని గురించి ఆలోచించటమే గతితర్క విరుద్ధం. వ్యక్తులు లేకుండా, వ్యక్తుల సంబంధాలు లేకుండా వ్యక్తిని గురించిన ఆలోచన అర్థరహితం. వ్యక్తి ఏకాకికాడు, స్థిరమైన దృగంశమూకాడు. వ్యక్తి చరిత్ర క్రమఫలితం. మందలో ఒకడుగా ఉన్న మనిషి చరిత్ర క్రమంలో సామాజిక వ్యక్తి అయ్యాడు. "సమాజం అంటే కేవలం వ్యక్తుల సముదాయం కాదు. వ్యక్తుల అన్యోన్య సంబంధాల మొత్తం సమాజం. వ్యక్తులు ఈ సంబంధా

ల్లోనే వుంటారు. బానిసగా వుండటం, పౌరుడుగా వుండటం సమాజలక్షణాలు, ఎ అనే వాడికీ బి అనే వాడికీ మధ్య సంబంధాలు వ్యక్తిగా ఎ అనేవాడు బానిస కాడు. అతడు సమాజంలో, సమాజం నుంచి బానిస"5. సుదర్శనం అనే ఒకవ్యక్తి సుదర్శనం కాబట్టి రచయిత కావటం లేదు. సమాజంలో, సమాజం నుంచి వ్యక్తుల మధ్య అన్యోన్య సంబంధాల వల్లనే సుదర్శనం రచయిత అయ్యాడు.

బాహ్య ప్రపంచంతోనూ, ఇతర వ్యక్తులతోనూ సంకీర్ణ సంబంధాల ఫలితంగా వ్యక్తి నిరంతరం మారుతూవుంటాడు. తనకు పూర్వం ఫ్యూయర్‌బాక్ (Feuerback) వంటి వాళ్ళు ప్రతిపాదించిన భౌతిక వాదానికీ గతితార్కిక భౌతిక వాదానికీ గల భేదాన్ని మార్క్స్ స్పష్టంగా వివరించాడు. ఈ విషయానికి సంబంధించిన మార్క్స్ కొటేషన్ కూడా సుదర్శనం పూర్తిగా ఇవ్వలేదు. తాను ముందే నిర్ణయించుకున్న పరిమితుల్లో సంకుచిత పరచటానికి అవసరం అయినంత వరకే మార్క్స్ వాక్యాల్ని



వుటంకించాడు. అవీ తానుగా చూసినవి కావు. మార్క్సిజం అండ్ లిటరేచర్ అనే పుస్తకంలో జర్మన్ ఐడియాలజీలోదిగా కోట్ చేయబడిన దాన్ని తీసుకొని వ్యాఖ్యకు పూనుకున్నాడు. ఫలితంగా సుదర్శనం చేతుల్లో గతి తార్కిక భౌతికవాద ప్రాణం పోయింది. ఫ్యూయర్ బాక్‌తో సహా ఇంతకు పూర్వం భౌతిక వాదంలో ఒక ప్రధాన లోపం వుంది, అది వస్తువుల్ని, వాస్తవికతను, ఇంద్రియజ్ఞానాన్ని విషయ (object) రూపంలోనే భావించింది. ఆలోచనా రూపంగానే స్వీకరించింది. ఇంద్రియ జ్ఞాన సంబంధమైన మానవ కార్యంగా, ఆచరణగా విషయిగతంగా (subjectively) గ్రహించలేదు. అందుచేత భౌతిక వాదానికి వ్యతిరేకంగా క్రియాశీల భాగాన్ని భావవాదం అరూపం చేసింది. భావవాదానికి వాస్తవం, ఇంద్రియ కార్యాచరణల వంటి వాటిని గురించి తెలీదు. సుదర్శనం మార్క్స్ వాక్యాల్ని ఇంత వరకూ మాత్రమే ఇచ్చి వివరణకి పూనుకున్నాడు. సుదర్శనం కోట్ చేయని దీని కొనసాగింపు ఇది "ఫ్యూయర్ బాక్ సిద్ధాంత రూపం ఇచ్చిన వస్తువులని వాస్తవంగా భిన్న ప్రత్యక్ష గోచర వస్తువుల్నే కోరాడు. కాని అతడు మానవ కార్యాచరణని భావించుకోలేకపోయాడు. అందుచేత తన గ్రంథంలో ఫ్యూయర్ బాక్ సైద్ధాంతిక ధోరణిని వాస్తవమైన మానవతా ధోరణిగా పరిగణించాడు. ఆచరణని మురికి జూయిష్ రూపంగా మాత్రమే అవగాహన చేసుకొని నిర్వచించాడు. కాబట్టి అతడు ఆచరణ,

విమర్శలోని విప్లవ సార్థకతని అర్థం చేసుకోలేకపోయాడు"[6] భౌతికవాద, భావవాదాల్ని నిరాకరిస్తూ గతి తార్కిక భౌతిక వాదాన్ని వివరిస్తున్న ఈ మార్క్స్ వాక్యాల్ని సుదర్శనం వ్యక్తిని గూర్చిన తాత్త్విక వివరణగా (Meta Physical description) అపోహపడి కుతర్కంలో పడ్డాడు. అధి భౌతిక ధోరణిలో దారి తప్పిపోయాడు. ఈ పరిశీలనలో మార్క్స్ గతి తార్కిక భౌతిక వాదాన్ని ఆచరణ తత్త్వశాస్త్రంగా నిరూపించాడు. విషయి, విషయాల (Subject and Object) పరస్పర సంబంధాల్ని ప్రతిపాదించాడు. మనిషి బాహ్య ప్రపంచాన్ని జడాత్మకంగా ప్రతిబింబించుకోడు. క్రియా శీలంగా వ్యవహరిస్తాడు. తన ఆచరణతో బాహ్య ప్రపంచాన్ని మారుస్తాడు. ప్రపంచాన్ని మారుస్తూ మనుషులు తమ గ్రహణ శక్తిని విస్తృతం చేసుకుంటారు. ఇంకా ప్రపంచాన్ని మార్చే శక్తిని పెంచుకుంటారు. భావవాదులు ఆత్మనో, దేవుడినో సృజనకు మూలశక్తిగా చెప్పారు. మనిషి బాహ్య ప్రపంచ ఉత్పత్తి మాత్రమే అనీ, బాహ్య ప్రపంచం కూడా ఆలోచనకు లక్ష్యభూతమైన విషయం మాత్రమే అనీ భౌతిక వాదులు చెప్పారు. గతి తార్కిక భౌతిక వాదం వాస్తవికతను ఒక క్రమంగా, ఒక చలనంగా, మార్పుగా వివరించింది. సామాజిక వాస్తవికతని విషయగత, విషయిగత అంశాల అన్యోన్య క్రియగా, బాహ్య పరిస్థితుల మానవ ఆచరణల అన్యోన్య క్రియగా విశ్లేషించింది. మానవుడుస్వతంత్ర ప్రతిపత్తిగల వాడనే అభిప్రాయాన్ని, వాస్తవంలో మనిషి పరిస్థితులకి బానిసగా వుండి స్వతంత్రంగా వున్నట్టు కనబడతాడనే అభిప్రాయాన్ని గతి తార్కిక భౌతిక వాదం ఖండించింది. మనుషులు లేకుండా మనిషి ఉండడు కాబట్టి పూర్వ భౌతిక వాదులు మానవుల్లోని క్రియాశీల శక్తిని నిర్లక్ష్యంచేసి, ప్రపంచాన్ని మార్చే మానవ ఆచరణని విస్మరించారు. మార్క్స్ మానవుల క్రియాశీల విప్లవ కార్యాచరణని వివరించి ఆచరణ తత్త్వశాస్త్రాన్ని స్థాపించాడు. ప్రపంచాన్ని మార్చటం, తాము మారటం కలిసే వుంటాయి. కానీ అవి అవిభాజ్యాలు కావు. మానవ చరిత్రని మానవులే నిర్మిస్తారు. కానీ తమ ఇష్టం వచ్చినట్టు నిర్మించలేరు. పూర్వ దశ నుంచి సంక్రమించిన, పరివర్తనా దశలోని నిర్దిష్ట చారిత్రిక పరిస్థితుల్లోనే చరిత్రని నిర్మించగలరు. ప్రకృతి పరిణామానికి వున్నట్టుగానే సామాజిక పురోగమనానికీ వస్తుగత సూత్రాలు వుంటాయి.

## విషయి - విషయం

సుదర్శనం గతితార్కిక భౌతిక వాదంలోని ప్రధాన అంశమైన ఆచరణని వదిలేశాడు. పైగా విషయి (Subjcet) విషయం (Objcet) అనే ద్వంద్వాన్ని

అధిగమించే తాత్త్విక భూమిక మీదనే గతితార్కిక భౌతిక వాదం ఏర్పడిందని చెప్తున్నాడు. విషయం పొందే అభివృద్ధిలోనే ఆ అభివృద్ధిని సాధించే విషయి రూపొందుతుంది. విషయి కంటే విషయం ముందే ఉనికిలో ఉన్నప్పుడు (జీవరాసుల కంటే పూర్వమే భూమి ఉనికిలో వుంది) విషయి విషయాల ద్వంద్వాన్ని అధిగమించటం అసలు శాస్త్ర విరుద్ధం. మనస్సుకీ, శరీరానికీ ద్వంద్వాన్ని (Dualism) గతితార్కిక భౌతికవాదం నిరాకరిస్తుంది. దీన్నే భౌతిక అద్వంద్వత (Materialist Monism) అంటారు. విప్లవ కార్యాచరణ విషయి, విషయాలు కలుసుకునే కేంద్ర స్థానం. ఫ్యూయర్‌బాక్ భౌతిక వాదాన్ని ఖండించిన మార్క్స్ థీసిస్‌ని సుదర్శనం తాత్త్విక వివరణగా అర్థం చేసుకోవటం గతితర్కం నుంచి ఫ్యూయర్‌బాక్ భౌతిక వాదానికి తిరోగమించటమే. ఇక్కడ విషయిని శారీరకంగా, సామాజికంగా, చారిత్రికంగా, పదార్థ పరంగా అర్థంచేసుకోవాలి. శారీరకంగా మనుషులకి ప్రత్యేక ప్రతిపత్తి ఉంది (మనిషికికాదు) అంటే విషయిని జీవశాస్త్ర పరంగా కూడా పరిశీలించాలి. మనిషి మెదడును గురించిన ప్రస్తావన లేకుండా విషయి, విషయాల సంబంధాన్ని అర్థం చేసుకోవటం సాధ్యంకాదు. విభిన్న విజ్ఞానశాస్త్ర పరిశోధనల్ని సమన్వయం చేసుకుంటే విషయిని సరియైన పునాది మీద అవగాహన చేసుకోవచ్చు. జీవశాస్త్రంలో మనిషి విషయి మాత్రమేకాదు, విషయం కూడా. మనస్తత్వ శాస్త్రాన్ని జీవశాస్త్రంతో కలిపి అధ్యయనం చేస్తే విషయి ఆంతరంగిక అంశం అర్థం అవుతుంది. మెదడు శారీరక స్వభావాన్ని వదిలిపెట్టి మనస్సుని గురించి ఆలోచించటమే భావవాదం. విషయిలోని సైకీ (Psyche) కీ మెదడుకీ సంబంధాల్ని పరిశోధించే ప్రయత్నాల్లోనే భావవాద, భౌతికవాద సంఘర్షణవుంది. విషయిలో సైకీ విషయి, మెదడు విషయం. విషయి, విషయాల మౌలిక సంబంధం పదార్థ (Material) సంబంధమే. గతితార్కిక భౌతిక వాదానికి విజ్ఞాన శాస్త్రాలు పోషక పదార్థాలని విస్మరించ కూడదు. విషయిలో సామాజికంగా రూపొందే వ్యక్తినీ, చారిత్రికంగా పరివర్తనా దశలో ఉండే వ్యక్తినీ, విప్లవ కార్యాచరణనీ, ప్రధాన పదార్థ అంశాన్నీ వదిలేసి తాత్త్వికవివరణకి సంకుచితంచేసి సుదర్శనం భౌతిక గతితర్కాన్ని అద్వైతంగా (Idealist Monism) గా నిర్ధారణ చేశాడు. మార్క్సిజాన్ని ఆచరణ శాస్త్రంగా ఒక మొత్తంగా అధ్యయనం చేయకుండా తనకి దొరికిన ఎంగిలి కొటేషన్లతో గతితార్కిక భౌతిక వాదాన్ని అవగాహన చేసుకోవటం సాధ్యం కాదని సుదర్శనానికి తెలీదు. మొత్తం నుంచి విడదీసి, మొత్తానికి వ్యతిరేకంగా భాగాల్ని అధ్యయనం చేయటం శుష్క ప్రయాస. అధ్యయనం చేసే పద్ధతి మీద అవగాహన ఆధారపడి వుంటుంది. ఒక

సమస్యని పరిష్కరించు కోవటం కోసం అధ్యయనం చేస్తూ, అధ్యయన క్రమంలో సమస్యని మర్చిపోతే మిగిలేది శుష్క తాత్త్విక వివరణే.

## భాష - చైతన్యం

భాషకీ చైతన్యానికీ గల సంబంధాన్ని చెప్పిన మార్క్స్ కొటేషన్ కూడ సుదర్శనం ఇచ్చాడు. ఇక్కడా సందర్భ జ్ఞానంలేదు. ప్రాథమిక చారిత్రిక సంబంధాల్ని గురించి చెపుతూ ఉత్పత్తి, సంతానఉత్పత్తి, కొత్త అవసరాల ఉత్పత్తి, సామాజిక సంసర్గం (Social inter course) చైతన్యం మొదలైన విషయాల్ని వివరిస్తూ మార్క్స్ భాషకీ, చైతన్యానికీ వున్న మూల సంబంధాన్ని చెప్పాడు. మార్క్స్ ఈ సందర్భంలో చెప్పింది భాషకీ చైతన్యానికీ మౌలిక సంబంధం వుందని. అయితే అది స్థిర సంబంధం (Fixed) కాదనీ సుదర్శనానికి తెలీదు. శ్రమ విభజన చైతన్యం వాస్తవ ఉత్పత్తి దారుల నుంచి విడిపోవటం స్వతంత్రతా భ్రమని కలిగించటం, అనేక భ్రమల్ని అరూపీకరించటం వంటి మార్క్స్ పరిశీలనల్ని సుదర్శనం పట్టించుకోలేదు.

మనుషులు భౌతిక జీవితాన్ని ఉత్పత్తి చేసుకోవటం, ఉత్పత్తి సాధనాల్ని ఉత్పత్తి చేసుకోవటం, భాషనీ చైతన్యాన్నీ పొందటం సామాజిక కార్యాచరణలో విభిన్న దశలుకావు. విభిన్న అంశాలు. చరిత్ర తొలిదశలో ఏక క్రమంలో సంభవించినవే ఇవన్నీ. ప్రాథమిక చారిత్రిక సంబంధాల్లోని ఈ అంశాల్ని దృష్టిలో పెట్టుకొని భాషా, చైతన్యాల్ని గురించి ఆలోచించాలి. "ఆరంభం నుంచి మనస్సు పదార్థా భారంతో నిండి ఉండటంతో పీడించబడుతుంది. ఇక్కడ ఆ పీడన కలవర పెట్టే వాయు, శబ్ద తరంగాల్తో ఒక్కమాటలో భాషా రూపంతో కనిపిస్తుంది"[7] ఇది భాషకీ చైతన్యానికీ వున్న పదార్థ సంబంధం. ఉత్పత్తిలో మానవులకీ ప్రకృతికీ మధ్య ఉత్పత్తి సాధనాలుఉంటే, మానవులకీ మానవులకీ మధ్య భాష సాధనంగా వుంటుంది మానవసమాజం మానవుల శక్తుల్ని క్రమబద్ధంచేసి నిలువ ఉంచుకో గలుగుతుంది. ప్రకృతి పరిణామానికీ చరిత్ర పురోగమనానికీ మౌలిక భేదం ఇదే. "జంతువులు తమ జాతికి సంబంధించిన విభిన్న గుణాలను సమ్మేళనం చేసుకోలేవు. జాతి సామూహిక ప్రయోజనానికీ, సుఖానికీ దోహదం చేసుకోలేవు. మానవుల విషయంలో ఇది పూర్తిగా భిన్నంగా వుంటుంది. ఏ మాత్రం పోలికలు లేని విభిన్న మానవుల శక్తులూ, ఆచరణ రూపాలూ పరస్పరం ఉపయోగకరంగా వుంటాయి. ఎందుకనంటే మనుషులు వాళ్ళ విభిన్న ఉత్పత్తుల్ని సామూహిక ఆస్తిగా ఒక చోటకి

తెచ్చుకోగలరు"[8]. ప్రపంచానికి సంబంధించిన మానవ జ్ఞానాన్నీ, ఉత్పత్తి అనుభవాన్నీ, సామాజిక జీవిత అనుభవాన్నీ, సాంస్కృతిక విజయాల్నీ, భౌతిక విలువల్నీ పోగుచేసి నిలువఉంచుకోగలగటమే మానవ నాగరికతా పురోగమన కీలకాంశం. ఈ నిలువవుంచుకొనే సామాజిక విధానాల్లో భాష ముఖ్యమైన సాధనం. మనిషిని మనిషిగా చేసేది శ్రమ, చైతన్యం, చైతన్యవంతమైన కార్యాచరణ. ఈ శ్రమ, చైతన్యం, భాష సామూహిక శ్రమ, సామూహిక జ్ఞానం, ప్రజల మధ్య భావ ప్రకటనా మార్గాలే. జీవితానికీ శ్రమకీ, ఉత్పత్తికీ జ్ఞానానికీ, చైతన్యానికీ, భాషకీ మానవ ఆలోచనకీ వున్న ఈ సామూహిక స్వభావం మానవవ్యక్తికి సంబంధించిన సముచిత శరీర నిర్మాణానికి అన్యమైన పునాది. అయితే చైతన్యానికి లాగానే భాషకీ, సంభాషణ చేయటానికి మనిషి మెదడు మూలం. కేంద్ర నాడీమండల యంత్రాంగం చెడిపోతే సంభాషణ సాధ్యం కాదు. భాషతో వ్యవహరించలేడు. కాబట్టి భాషకీ, చైతన్యానికీ మార్క్స్ ప్రతిపాదించిన సంబంధాన్ని భౌతిక గతితర్క పరంగానూ, సామాజిక చరిత్ర పరంగానూ, జీవశాస్త్ర పరంగానూ విశ్లేషించాలి. తత్త్వవేత్తలు ఆలోచనలకి స్వతంత్ర స్థితిని కల్పించినట్టే భాషని కూడా స్వతంత్ర రాజ్యంగా తయారుచేసుకున్నారు. పరిభాషని అపరిమితంచేసి దాన్నే భాషగా చేసుకున్నారు. తాత్త్వికభాషలో మాటల రూపంలోవున్న ఆలోచనలకి స్వీయవస్తువు వుండటానికి కారణం ఇదే. ఆలోచనల రాజ్యం నుంచి వాస్తవ ప్రపంచంలోకి అధిరోహణ చేయటం అంటే భాషనుంచి జీవితానికి అధిరోహణ చేయటమే. తత్త్వవేత్తలు చేయవల్సిందల్లా తమ భాషను సాధారణ భాషలోకి మార్చుకోవటం. వాస్తవ ప్రపంచాన్ని వక్రీకరించిన భాషగా తమ భాషను గుర్తించగలగటం. అప్పుడే ఆలోచనలకి కానీ భాషకి కానీ. వాటికి మాత్రమే పరిమితమైన స్వతంత్ర భూమిక లేదనీ, అవి వాస్తవజీవితఅభివ్యక్తులనీ గుర్తించ గలుగుతారు. మానవుల అన్యోన్య సంసర్గానికి దోహదం చేయలేని, వాస్తవ జీవితానికి సంబంధంలేని భావ వాద తాత్త్వికుల 'భాషా స్వతంత్ర భూమిక'నే శబ్దాన్ని విలక్షణంగా, సృజనాత్మకంగా వ్యక్తి ప్రయోగించటం అని సుదర్శనం చెపుతున్నాడు. మార్క్స్ కొటేషన్ ఇచ్చి దానిలో భౌతిక గతితర్కాన్ని విస్మరించి భావవాద పరంగా వ్యాఖ్యానించి నిర్ధారణ చేస్తున్నాడు. వాస్తవ జీవితానికి అతీతంగా ఆలోచనల్ని ఉత్పత్తి చేస్తున్నామని అహంకరిస్తూ బతికే మేధావులు కొత్త అర్థం పేరుతో శబ్దాన్ని తమకీ తమలాటి సోమరితలకాయలకీ మాత్రమే అర్థమయ్యేటట్టు క్షీణ భాషను సృష్టించటాన్ని సుదర్శనం భవిష్యత్తులో సిద్ధించే కొత్త అర్థంగా చెపుతున్నాడు. సామాజిక భౌతిక

వాస్తవికతకి దూరమైన మేధావులు వస్తువుల్ని గురించిన భావనల్ని ఏర్పరచుకోవటంలో సులభపద్ధతిని అనుసరించలేరు. జీవితం నుంచి విపరీత కల్పనల్లోకి ఎగిరిపడతారు. అరూప ప్రత్యయాన్ని (Abstract Concept) భావాన్ని విపరీత కల్పనగా మార్చి వేస్తారు. వాస్తవ జీవితంలోని దేన్నీ వ్యక్తం చేయకుండానే వాస్తవాన్ని వ్యక్తం చేస్తున్నట్టు భాషతో గారడీచేస్తారు. వ్యక్తి శబ్దాన్ని విలక్షణంగా, సృజనాత్మకంగా ప్రయోగించటం అనే ముసుగులో ఈ రకమైన గారడీనే సుదర్శనం సమర్థిస్తున్నాడు. ముందు విషయి (Subject) నుంచి విప్లవ కార్యాచరణని వదిలేశాడు. తర్వాత భాష, చైతన్యాల నుంచి శ్రమని వదిలేశాడు. తాత్త్వికంగా ఆచరణని వదిలిపెట్టి, విషయికి చైతన్యం వుంటుందని స్థాపించుకున్నాడు. భాషా పరంగా శ్రమని వదిలి పెట్టి, శ్రమ విభజనని వదిలిపెట్టి వ్యక్తుల సంసర్గాన్ని వదిలిపెట్టి, మనిషి మెదడుని వదిలిపెట్టి వ్యక్తికి విలక్షణ సృజనాత్మక శబ్ద ప్రయోగశక్తిని స్థాపించుకున్నాడు. ఇక చైతన్య పరంగా వ్యక్తి చైతన్యానికీ సామాజిక చైతన్యానికీ సంబంధాన్ని విశ్లేషించటానికి పూనుకున్నాడు.

## వ్యక్తి చైతన్యం - సామాజిక చైతన్యం

ఇక్కడ సుదర్శనం చైతన్యానికి భౌతిక ఆధారాన్ని వదిలేశాడు. అంటే భౌతిక వాదాన్ని కూడా వదిలేశాడు. చైతన్యానికి వుండే వర్గ స్వభావాన్ని వదిలేశాడు. సమాజంలో వర్గాల రూపం ఏమిటి? వ్యక్తి ఏ వర్గ స్థానంలో వున్నాడు అని సమాజ చారిత్రిక దశతో అన్వయించకుండా, వ్యక్తి చైతన్యం సామాజిక చైతన్యం అంటూ గాలిపేనితే సక్రిమ నిర్ధారణలకి రావటం ఎలా సాధ్యం?

వ్యక్తులు లేకుండా సమాజం వుండదు. అంత మాత్రాన వ్యక్తుల సమూహం సమాజంకాదు. నిర్దిష్ట ఉత్పత్తి సంబంధాల్లో జీవించే వ్యక్తుల కూడికే సమాజం. ఇతర వ్యక్తులతో కలిసి జీవించటం అనే చారిత్రిక క్రమం నుంచి రూపొందే సామాజికజీవి వ్యక్తి. వ్యక్తులు లేకుండా వ్యక్తి వుండడు. పరిసరాల ఎరుక (Social awareness), తన మనస్తత్త్వం పనిచేసే స్వీయ ఎరుక (self awareness) వ్యక్తి చైతన్యం అవుతుంది. స్వీయ ఎరుక సామాజిక ఎరుక నుంచి ఉత్పన్నం అవుతుంది. సుదర్శనం సామాజిక చైతన్య పరివర్తనలో వ్యక్తి చైతన్యం ప్రాధాన్యం అంటున్నాడు. అప్పుడు పరివర్తన చైతన్యానికి సంబంధించింది మాత్రమే అవుతుంది. చైతన్యం చైతన్యాన్ని మార్చలేదు. చైతన్య పరివర్తనకి

అంతిమంగా చైతన్యాన్నే కారణంగా చెప్పటం భావవాదం. చైతన్యానికి మూలాధారమైన వాస్తవం మారినప్పుడే చైతన్యం మారుతుంది. తాత్త్వికమైన మార్పుకి ఒక కారణం, భౌతికమైన మార్పుకి ఒక కారణం వుండవు. వ్యక్తి చైతన్యం సామాజికమైన ప్రకృతి పరిజ్ఞానానికి సంబంధించిన హద్దుల్లోనే వుంటుంది. వ్యక్తి విలక్షణత, సృజనాత్మకత భౌతికావసరాల ఉత్పత్తి నుంచి, శ్రమశక్తి వినియోగ అనుభవం నుంచి వికసిస్తాయి. వర్తమాన దశకి పూర్తిగా భిన్నమైన దశను కూడా వర్తమాన ప్రేరణతోనే, వర్తమానంలోని వాస్తవిక అంశం ఆధారంగానే వ్యక్తి భావించగలుగుతాడు. పెట్టుబడిదారీ సమాజం పరివర్తనా దశలోనిదే అనీ, దాని స్థానంలో కమ్యూనిస్టు సమాజం వస్తుందనీ కార్మికవర్గం వున్నది కాబట్టే మార్క్స్ భావించగలిగాడు. వ్యక్తుల కుండే చైతన్యం సామాజిక చైతన్యం. వ్యక్తులు లేకుండా సామాజిక చైతన్యం ఎవరికి, ఎక్కడ వుంటుంది? వ్యక్తి, సమాజం కాకుండా బాహ్య భౌతిక ప్రపంచం సంగతి ఏమిటి మరి? పదార్థ సంబంధమైన చైతన్యం 'వ్యక్తి' పొందుతున్నాడా, సమాజంగా రూపొందుతున్న వ్యక్తులు పొందుతున్నారా? చైతన్యానికి పదార్థం ముఖం మాత్రమే కాదు, కాళ్ళూ, ముఖం కూడా పదార్థమే.

సుదర్శనం ఇక్కడ పదార్థాన్ని వదిలించుకొని సమాజం మీద దాడి మొదలెట్టాడు. దానికి పూర్వరంగంగా సమాజానికీ, పదార్థానికీ భిన్నమైన వ్యక్తి చైతన్యాన్ని సాధించాడు. సుదర్శనం కొన్ని సందర్భాల్లో ఏ సమాజాన్ని గురించి మాట్లాడుతున్నాడో గ్రహించటం సాధ్యంకాదు. వర్గ సమాజంలో మానవుడు శకలం. వర్గ రహిత సమాజంలోనే మానవుడు మానవుడవుతాడు. అలాంటి సామాజిక దశ ఇప్పుడు ఎక్కడాలేదు. కాబట్టి ఆ దశలో వుండే "మార్క్సిస్టు రాజకీయ వాదులు" ఇప్పుడు ఎక్కడా లేరు. ఇంతకీ వర్గరహిత సమాజంలో కూడా మార్క్సిస్టు రాజకీయవాదులు వుంటారని సుదర్శనానికి మార్క్స్ కలల్లో కనపడి చెప్పాడా? ఎందుకీ అక్కరకురాని కుర్చీ కూనిరాగాలు? మానవుడు సమాజ జీవి (Social being) అంటే భౌతికంగా, బౌద్ధికంగా ఇతర వ్యక్తుల్తో సమిష్టిగా జీవించేవాడని అర్థం. సాధారణ సమాజ జీవి (Social being in general) అంటూ వుండడు. నిర్దిష్ట భౌతిక పరిస్థితులుగల సామాజిక దశచేత నిర్ణయింపబడేవాడు సమాజ జీవి. "Social being determines consciousness" అన్నప్పుడు సుదర్శనం "సామాజిక సత్త" అని ఇప్పుడు "సామాజికుడు" అనటం ఎందుకు? ఈ సామాజికుడి నుంచి భావ

స్వాతంత్ర్యానికి, అక్కడ నుంచి సృజనకు ప్రయాణం చేశాడు సుదర్శనం. సమాజంలో ప్రతి వ్యక్తికీ కేంద్ర స్థానమూ, భావ స్వాతంత్ర్యమూ వుండటం అంటే అర్థం ఏమిటి? వ్యక్తికి 'స్వచ్ఛ' కేంద్ర స్థానం, 'స్వచ్ఛ' భావ స్వాతంత్ర్యం ఎలా సాధ్యం అవుతాయి? అవన్నీ సాపేక్షకాలూ, సామాజిక పురోగమన ఫలితాలూ? ఇదంతా సుదర్శనం ఎందుకు చెపుతున్నట్టు? మార్క్స్ చెప్పిన సామూహిక జీవితాన్ని (Collective life) ఖండించటానికి.

## శూన్యం నుంచి సృజన

మార్క్స్ మానవతా వాదాన్ని మార్క్సిస్టు రాజకీయవాదులూ, వారిపరివారమైన రచయితలూ వక్రభాష్యం చేస్తున్నారు; మందిలో ఒక శాల్తీగా వ్యక్తిని హీతమార్చి వ్యవహరిస్తున్నారని సుదర్శనం బాధపడి పోతున్నాడు. అంటే మార్క్స్ మానవతా వాది, మార్క్సిస్టులు మానవతా హంతకులు. ఈ రకం మార్క్సిస్టు రాజకీయ వాదుల్ని సుదర్శనం ఏ గ్రహంలో చూశాడు? మనిషి అభివృద్ధి పొందే, మనిషి నిత్యమూ వ్యవహరించే, ప్రతిక్షణం స్పృహలో వుండక తప్పని సమాజం అమూర్తం ఎలా అవుతుంది? స్త్రీ పురుష సాంగత్యం మూర్తమా? అమూర్తమా? స్వేచ్ఛగా వాస్తవంలో సంఘటితం అయ్యేవ్యక్తులు లేకుండా సామూహికత ఎలా వుంటుంది? వ్యక్తి చైతన్యం సామాజిక చైతన్యం తాలూకు విషయి అని ఎవడు చెప్పాడు సుదర్శనానికి? వ్యక్తి చైతన్యానికి విషయమైన సామాజిక చైతన్య రూపం ఏమిటి? ఈ వ్యక్తి చైతన్యం అనేది మళ్ళా సుదర్శనం అభిమానించే ఆచరణ లేని విషయి, శబ్దాన్ని విలక్షణంగా సృజనాత్మకంగా ప్రయోగించి కొత్త అర్థాన్ని సంతరింప చేసే సృజనకారుడు, సమాజంలో కేంద్ర స్థానాన్నీ, భావ స్వాతంత్ర్యాన్ని పొందిన వ్యక్తి - చేతనుడు వున్నాడే వాడి శూన్యం. ఈ శూన్యం నుంచి రచయితకి కొత్త భావాలు పుడతాయట. చైతన్యం నుంచే చైతన్యం పుడుతుందని కూడా మార్క్స్ చెప్పాడన్నమాట; కొత్త భావాలకి భౌతిక జీవితంలోని కొత్త శక్తులు కారణం కాదన్నమాట. కార్మికవర్గ విప్లవం అనే భావం సామాజిక చైతన్యం తాలూకు విషయి కావటం వల్ల మార్క్స్ చెప్పాడు కానీ కార్మికవర్గం ఉండటం అనే సామాజిక వాస్తవికతకి విషయి కావటంవల్ల కాదన్నమాట. ఇదంతా గతితార్కిక భౌతిక వాదమా? ఈ నాటు జ్ఞానంతో సుదర్శనం "మార్క్సిస్టు రాజకీయవాది" అధికారాన్నీ, యోగ్యతనీ, ప్రశ్నించే సాహసమే ఆశ్చర్యంగా వుంది. ఇలా మార్క్సిజంలోని ప్రాణవంతమైన సూత్రాల్ని ఒకదాని తర్వాత ఒకటిగా వదిలేసి, చివరకి మానవతా వాదం దగ్గరకు చేరుకున్నాడు సుదర్శనం.

సమీక్ష :

## జలపాతం నిరంతరం కావాలని...

జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ తెలుగు విద్యార్థులు, ఉపాధ్యాయుల కృషితో 'ప్రగతిసాహితి' మొదటి ప్రచురణగా 'కాళోజీ' సంపాదకత్వంలో వెలువడిన కవితాసంకలనం 'జలపాతం'. ఇందులో సుపరిచితులూ అపరిచితులూ అయిన ఏబది ముగ్గురు కవుల కవితా ఖండికలున్నాయి.

కాళోజీ అన్నట్టు 'మేధావులలో చాలామంది సమకాలీన బకాసురులతో రాజీపడి ప్రజానీకం అగచాట్లను గుర్తింపరు. తమ హాయిజీవితమే వారి లక్ష్యం. వారు కన్‌ఫర్‌మిస్టులు (యథాతథవాదులు) మేధావుల్లో మరోవర్గం ప్రస్తుత వ్యవస్థలోని దోపిడీ దౌర్జన్యాలకు విరుద్ధంగా అధికారవర్గంపై దండెత్తుతారు.' అంటే సమాజ పురోగమన సిద్ధాంతానికి కట్టుబడి సమసమాజస్థాపన లక్ష్యంపైపు సాగిపోతారు. జలపాతం కవుల్లో ఎక్కువ భాగం యీ కోవకు చెందినవారే.

శ్రమజీవుల యెడ గాఢమైన ప్రేమ - బాధామయమైన వారి జీవితాలపట్ల సానుభూతి- వారి బాగుకోసం తీవ్రమైన ఆకాంక్ష, కృషి లేని రచయిత సమాజానికి చేయ గలిగిందేమీ ఉండదు.

సామాజిక చైతన్యం, సరైన రాజకీయ అవగాహన ఉన్న రచయిత మాత్రమే సమకాలీన సమాజంలో తన కర్తవ్యాన్ని నిర్వచించుకో గలుగుతాడు. తన మార్గాన్ని ఎంచుకో గలుగుతాడు.

రచయితలకూ రాజకీయాలకూ సంబంధమేమిటి అనే కాలం చెల్లిపోయిన వాదన. రచయితలకూ జీవితానికీ సంబంధమేమిటి? అనడమే అవుతుంది. అయితే రాజకీయాలు రెండు రకాలు. సమాజాన్ని ముందుకు నడిపేవీ- యథాతథ పరిస్థితిని కొనసాగించేవీ- రాజకీయాల జోలికి పోగూడదనేవారు ప్రత్యక్షంగానో పరోక్షంగానో యీరెండో రకం దోపిడీ రాజకీయాలకు దోహదం చేసేవారే.

సర్వసంపదలకు సృష్టికర్తలు, సమాజ పురోగతికీ, నాగరికతా నిర్మాణానికీ కారకులు అయిన శ్రమ జీవులను నిర్లక్ష్యంచేసే ఏ కళ అయినా హేయమైనదీ, క్రూరమైనదీ- అందుకే శ్రామిక జన విముక్తికోసం రచయితలు, కళాకారులు తమ శక్తియుక్తులను ధారపోయడం వారి కర్తవ్యమౌతుంది.

---

← పక్క పేజీలోని త్రిపురనేని మధుసూదనరావు సమాధానం ఇంకా వున్నది.
మిగతా వచ్చే సంచికలో....

కవిత్వం కాలక్షేపానికి కాదు. మనిషిని మనిషి తినే యీదుర్మార్గపు వ్యవస్థ మీద కవిత్వం దండయాత్ర. శ్రమజీవి కన్నీటిని, కలలను, ఆశలను, ఆకాంక్షలను, అతని నిరంతర పోరాటాన్ని, దోపిడీ శక్తులను మట్టి కరిపించే అతని అజేయశక్తిని, సమరశీలాన్ని కవిత్వం ప్రతిబింబించాలి. అతని వెన్నుతట్టి ఆత్మ విశ్వాసాన్ని నూరిపోయాలి.

అయితే కవిత్వం నినాద ప్రాయంగా, పొడి అక్షరాల పరిబోధంగా కాక కళాత్మకంగా యధార్థాల కన్నులకు కట్టేదిగా మనసును తాకి ముందుకు నడిపేదిగా వుండాలి. ఇందుకు సమకాలీన జీవిత పరిశీలన, చరిత్ర అధ్యయనం, శ్రామిక జన పక్షపాతం, ధైర్యసాహసాలు, వీటన్నిటినీ మించి నిజాయితీ అవసరం.

ఈ దృష్ట్యా 'జలపాతాన్ని' చూసినపుడు

కన్ను దెరిసి కన్ను మూస్తె
కండ్లల్లొ కదులు తుండ్రి
కాలు దీసి కాలు వేస్తె
కాళ్ళల్లొ మెదులు తుండ్రి
సక్కనైన కొడుకులమ్మ వోలీ
శెమ్మ కేలీల వోలీ
సుక్కల్లొ కలిశి రమ్మ వోలీ
శెమ్మ కేలీల వోలీ.

కొడుకులార మిమ్ములాను
కలలగూడ మరిసిపోము
బిడ్డలార మిమ్ములాను
బాధలల్ల మరిసిపోము
కసి దీర్చ కానీకి వోలీ
శెమ్మ కేలీల వోలీ
కాళమ్మ లొతాము వోలీ
శెమ్మ కేలీల వోలీ.

శ్రామికజన విముక్తి కోసం పోరాడుతూ దోపిడీ దారుల పక్షం వహించిన పోలీసుల చేతులలో అసువులు బాసిన అమరవీరుల స్మృతిలో వి. బి గద్దర్ జానపద బాణీలో రాసి పాడిన యీపాట మనస్సుకు తగులుతుంది. అందుకే జనంలో యీ పాట విస్తృత ప్రచారం పొందింది.

ఆకాశంలో సగం నీవు
అనంతకోటి నక్షత్రాల్లో
సగం నీవు సగం నేను
తూర్పు పవన సంగీతంలో
రాగం నీవు తానం నేను
మనిద్దరం కలిసి
విప్లవిస్తే విజయం

విప్లవ పథానికి మనిద్దరం
కలిసి కట్టుగా బాసచేసిన వేళ
త్యాగం మన పేరు
పోరాటం మన వూరు
విప్లవాకాశంలో
నీవూ నేనూ

"Women are half of the sky" అనే మావో వాక్యం ప్రేరణగా శివసాగర్ రాసిన చక్కని కవిత 'ఆకాశంలో సగం నీవు'- జీవితంలో, పోరాటంలో స్త్రీ అనివార్య భాగస్వామ్యాన్ని, ప్రాముఖ్యతను మనోహరంగా చెపుతుంది-

జన్మంతా బుర్రతాకట్టు / చేతులూ కాళ్ళూ ఒంటికి వెయ్యబడ్డ సంకెళ్ళు / కుంటి గుర్రాలు / జవ సత్వాలు / ఒళ్ళంతా / జన్మంతా / పొట్టకోసం బతుకు / మనసు కంచంలో పాతేసిన మెతుకు / వెన్నుపూస - వానపాము / మట్టి గతుకు 'కుళ్ళిన మధ్య తరగతి కోడి గుడ్డు'లో నగ్నముని మధ్య తరగతి జీవితాన్ని కళ్ళకు కట్టాడు- కాని యీ కవితలో కొన్నిచోట్ల అన్వయకాఠిన్యం ఉంది- ప్రతిభావంతుడైన యీ కవి సూటిగా సరళంగా ఉంటే బాగుంటుంది-

జ్వాలాముఖి "కల"లో ఎలాంటి దమనశక్తి విప్లవశక్తిని నాశనం చేయలేదు" అనే సందేశం ఉంది- అయితే యిప్పుడు మనచుట్టూ ఉన్న సంక్లిష్టమైన, పోరాట శీలమైన వాస్తవ జీవితంలోంచి కాక ఊహాజనితమైన క్యాన్వాస్ మీద ఎంత ఆవేశంగా, ఎంత ఉన్నతమైన విప్లవ ఆదర్శాల పెయింట్ చేసినా అది కృతకంగా కనిపిస్తుంది- ఈ కవిత ఎందుకో అలా అనిపిస్తుంది- పైగా కవిగా సంస్కృత పద ప్రయోగాల మోజు జాస్తి. చూడండి: 'శత సహస్ర కిరణాల జ్వాలాతోరణ త్ర్యారావాలు'- 'ఉధృటులు,' అలాగే 'మహాబోధి శయ్యాను, 'మానిషాద ఘోషించింది,' పాపీ చిరాయువు, వంటివి విప్లవ కవితలో పొసగని ప్రయోగాలు -

నేరుగా సులువుగా అర్థంకావటం విప్లవ కవిత కనీస ధర్మం. కాని నిఖిల్ కవిత 'వెంటాడుతున్న శూన్యం' అర్థంకావడం కష్టం- చూడండి "వెంటాడే రిక్త హస్తాల పాలిన ముఖాల మీద / ఉదయాస్తమయాలు ఒకే రూపంలో- భేదంలేని వెలుగు నీడల నిస్సత్తువలో / అరిగిన పద బంధాలలో నిప్పు పుట్టదు - / ఖాళీ సీసాల్లోకి ఖజానాలు దిగవు / దొర్లి దొర్లి ఫటేలున పగలడమే తప్ప !...." అలాగే 'చీకటి గుహల్లోకి మురికి దేవతలు / మసక వెలుతురు సంగీతాల్లోకి పరిశుభ్రమైన దానవులు'- ప్రత్యేకమైన ప్రయోజనం వుంటే తప్ప యీ 'దేవతలు, దానవులు' అనే పదాల ప్రయోగం ఎందుకు ?

చెరబండరాజు 'పోరుచెయ్యరో' ఎన్.కె. 'కంఠమ్మ ఎత్తవే' అనే కవితల్లో చెప్పుకోతగిందేమీ లేదు-

'ఏచిర బాధా జీవితం / కాలి మసైతే / ఏర్పడిందో యీ చీకటి
గుడ్డి దీపాలవైపు గుచ్చి గుచ్చి చూస్తోంది

రోడ్డు పక్కలో పడుకునివున్న / రిక్షా చక్రం చువ్వల మీంచి
జారిపోతూ వీధి లాంతరు వెలుగు / రోడ్డుకి ఆ చివర ఏదో ఆడనీడ

'దేవి ప్రియ' గీసిన యీ 'అర్ధరాత్రి నగరం' చిత్రం బాగుంది— కాని యీ ఫోటోగ్రఫీ కవితవల్ల ప్రయోజనమేమిటి?

"నన్ను రాజకీయాలకు దూరంగా ఉండమని నీతులు చెప్పకు
నీ ప్రాణం చిలుక ఏ చెట్టుపై ఉందో తెలుసుకోవద్దనకు
దాని పీక నులమవద్దనకు—" అంటాడు టంకశాల అశోక్ 'సంక నాకిన సదువు'లో

"నాన్నలూ - మీరేమీ తెలియని వాళ్ళు / తెలిసినా మాట్లాడని చవటలు /
పంతుళ్ళు - వాళ్ళని ఖూనీ చేయాలి"—

ఈ వ్యవస్థలో పంతుళ్ళైనా, విద్యార్థులైనా అంతే. గినీపిగ్స్‌ని తయారుచేసే వ్యవస్థలో మనం జీవిస్తున్నాం- వాళ్ళని ఏలా కూడగట్టాలో ముఖ్యంకాని తిడితే ప్రయోజనం?

"వార్తల పేపర్లంత పలచని వాళ్ళు
చావు మీ నెత్తుట్లో ఖూనీరాగాలు తీస్తున్నా తెలీని అమాయకులు.
బాబ్బాబు మాకు పీడ కలలొద్దు / మాకు మా ఆలోచనలు తప్ప యింకేమీ వొద్దు
ఎందుకలా ఏమిటి చేద్దాం అన్న ప్రశ్నలే వొద్దు
అవునవును మీరు మాకు కావలసిన వాళ్ళే
కాని మీరు మావాళ్ళే అనడానికి / మేం మాపెర్లీన్ల కింద తప్ప
నగ్నంగాలేం కదా మరి-"
అంటున్న 'సైకిల్' 'కన్పించని చావులు సముద్రాన్ని లేపలేవు'
పిల్లల మీద మంచి కవిత.

కె. శివారెడ్డిగారి 'చూపు'లో "'నల్లమేఘం రవికె' వెనక 'రవిస్తనాన్ని' చూడలేనివాడు / మనుషుల్లోని తిరుగుబాటు పొద్దుటి పూటల్ని చూడలేడు-" అనే చోట 'నల్లమేఘం రవికె' 'రవిస్తనం' రూపకాలంకారాలకి, మనుషుల్లో 'తిరుగుబాటు పొద్దుటి పూటలకి' సారూప్యం ఎలా కుదురుతుంది? ఇందులో 'కుక్క పిల్ల అనంత ఆర్తనాదం'గా బానిస 'ఎక్కుపెట్టిన విల్లంబు'గా కనిపించడం బాగుంది-

నిజం 'పండగ'లో
"పండగెప్పుడు పండగెప్పుడు / మావికొమ్మ పండగెప్పుడు
నాగుల తల నరికినప్పుడు / లేమి పేగుల నాగులన్నీ /పోరుబాటను శేరినప్పుడు"

అన్నప్పుడు పై చరణాల్లో మొదటి నాగులు దుర్మార్గులకు, దోపిడీదార్లకు సంకేతం కాని 'లేమి పేగుల నాగులు' అనే చోట నాగులు పేదోళ్ళకి సంకేతంగా పీడితుల పరంగా చెప్పటం సరైంది కాదు -

"నిర్లక్ష్యం తుఫానులో నిరుపేదల హత్య
ఎంతబాగా జరిగిందా అని ఏరియల్ సర్వేచేస్తున్నారు" అని తన 'తుఫాను' కవితలో ప్రభుత్వం నాటకాన్ని ఎత్తి చూపిన 'జీన్' అభివ్యక్తి బలపడవలసిఉంది-

ఎవరో పెద్దలు నిర్ణయంచేసిన సాంప్రదాయికమైన వివాహం వల్ల దంపతులు మానసికంగా ఎలా సన్నిహితులు కారో వి.ఆర్. విద్యార్థి కవిత 'అపరిచితులు' చక్కగా చెపుతుంది - అయితే యిప్పుడు మనకున్న సంబంధాలన్నీ ఆర్థికసంబంధాలే- సమ సమాజంలో మాత్రమే దంపతులు నిర్దిష్టమైన ధ్యేయంతో, సామాజిక బాధ్యతతో నిజమైన స్నేహితులుగా, సహచరులుగా, ప్రేమికులుగా జీవించగలుగుతారు -

దేశంలో దుర్మార్గపు నీతి అరుస్తూ, ప్రాచీన ఫ్యూడల్ సంస్కృతి ప్రగల్భాలతో పాలకులు ప్రజల్ని ఎంతో కాలం మభ్యపెట్టలేరు - అకలైనవాడు సహనం కోల్పోతాడు. తిరగబడతాడు - 'అపస్వరాలు' కవితలో నారా చక్కగా చెప్పారు.

ఈ సంకలనంలోని యువ కవుల్లో కొందరికి కవిత రాయాలన్న ఆవేశమే కాని సామాజిక వాస్తవాల అవగాహన, అనుభవం, ప్రేరణ, అధ్యయనం, పరిశీలన లేవు-

ఏ. కృష్ణారావు 'ప్రజ - నాయకుడు', వేమకోటి సీతారామశాస్త్రి 'ప్రతిధ్వనులు' ఉపాధ్యాయ 'నీ బతుకు తెరువుకు నీవు పోరాడు' కైవల్య 'కులమేంటికి' మొదలగు కవితలు చాలా పేలవంగా, ప్రొసాయిక్‌గా ఉన్నాయి -

"జీవిత ప్రయాణం ఎవరికీ తెలియదు" అంటున్న వి.ఎస్.ఆర్. అవధాని 'కల ఎగరేసిన తెల్లజెండా' అలాగే బి. నారాయణస్వామి 'తుఫాను తరువాత వసంతం' సలంద్ర 'జన సముద్రం' యింకా కొన్ని కవితల్లో అస్పష్టత, అయోమయ, అసంబద్ధత, అన్వయకాఠిన్యం కనిపిస్తాయి-

ఎన్. గోపి, రామా చంద్రమౌళి, కె. రామమోహన్‌రాజు, వడ్డేపల్లి సుధాకర్, జైరామ్, దాట్ల నారాయణమూర్తిరాజు, ఎం. రత్నమాల, గుడిహాళం రఘునాథం, రేగుల కిషన్‌రావు, బి.వి. రాజగోపాల్‌రావు, విరజాజి రామిరెడ్డి మంచి కవితలు రాయగల కవులని యీ కవితా సంకలనం రుజువు చేస్తుంది-

'జలపాతం'లో అచ్చు తప్పులు చాలా విసుగును పుట్టిస్తాయి-

గత సంవత్సరం వెలువడిన చాలా కవితా సంకలనాలకన్నా 'జలపాతం' మెరుగైన సంకలనం- ఇందుకు ఢిల్లీ 'ప్రగతి సాహితి' వారు అభినందనీయులు.

— అరుణ

# లాల్‌బహదూర్ కళాశాల సంఘటనలు - తొలివార్తలు

30-8-79 మధ్యాహ్నం కండక్టర్‌కు, ఒక విద్యార్థికి జరిగిన చిన్నతగాదాలోకి పోలీసులు అనవసరంగా ప్రవేశించి శాంతికి భంగం కలిగించారు.

వరంగల్ లాల్ బహదూర్ కళాశాలకు చెందిన ఒక విద్యార్థికి కండక్టర్‌కు చిన్నతగాదా జరిగింది. ఆవిషయమై శాంతియుత పరిష్కారానికి ప్రిన్సిపాల్, లెక్చరర్లు, విద్యార్థి ప్రతినిధులు, ఆర్ టిసి డిపో మేనేజర్ చర్చలు జరుపుతుండగా పోలీసులు ఆవరణలోకి ప్రిన్సిపాల్ అనుమతి లేకుండా, ప్రిన్సిపాల్‌కు తెలియకుండా జొరబడ్డారు. ఆవరణ నుంచి వెళ్ళిపొమ్మని చెప్పడానికి ప్రిన్సిపాల్ బయటకు వచ్చే సరికి సర్కిల్ ఇనస్పెక్టర్ శ్రీ మంగిశెట్టి లాఠీఛార్జికి ఉత్తర్వు లిచ్చాడు. ఆ లాఠీ ఛార్జిలో ప్రిన్సిపాల్‌తోపాటు ఇద్దరు లెక్చరర్లు, ఫిజికల్ డైరెక్టర్, ఇద్దరు అటెండర్లు గాయపడ్డారు. విద్యార్థినులతో సహా ముక్కు పచ్చలారని ఇంటర్ విద్యార్థు లెందరినో విపరీతంగా పోలీసులు కొట్టారు. ఆర్‌టిసి అధికారిని కూడా కొట్టారు.

ఈ సంఘటన గురించి ప్రిన్సిపాల్, సిబ్బంది విడుదల చేసిన ఒక వివరణలో "అనవసరమైన పోలీసుల ఉనికి వల్ల చాలా సులభంగా పరిష్కరించగలిగిన సమస్య తీవ్ర రూపం దాల్చింది- ఈ దురదృష్టకరమైన సంఘటనకూ, పోలీసుల పాశవిక ప్రవర్తనకూ సర్కిల్ ఇనస్పెక్టర్ శ్రీ మంగిశెట్టిదే పూర్తి బాధ్యత; ఆయన నాయకత్వంలో పోలీసులు విచక్షణా రహితంగా లాఠీఛార్జి చేశారు. ఆయన విధినిర్వహణలోవున్న, బాధ్యతాయుతమైన అధికారిలా ప్రవర్తించలేదు; మదించిన, కోపంతో వున్న ఒక అడవి మృగంలా ప్రవర్తించాడు. జరిగిన మొత్తం సంఘటనకు పూర్తి బాధ్యత శ్రీ మంగిశెట్టిదే- ఆయనను తక్షణం సస్పెండ్ చేయాలనీ, సంఘటనపై ఉన్నతస్థాయి న్యాయవిచారణ జరపాలనీ, దుండగులను చట్టప్రకారం శిక్షించాలనీ కోరుతున్నాం" అని రాశారు.

జిల్లా కలెక్టర్‌కు ఇచ్చిన వినతి పత్రంలో "ఇంత నిర్లజ్జగా, అమర్యాదగా, బాధ్యతా రహితంగా ప్రవర్తించే ఇలాంటి పోలీసు అధికారుల సంరక్షణలో శాంతి భద్రతలు హాస్యాస్పదంగా తయారవుతున్నాయని మేం అభిప్రాయపడుతున్నాం" అని రాశారు.

31-8-79న ఐదువేలమంది విద్యార్థులు కళాశాలలు బహిష్కరించి కలెక్టర్ ఆఫీసువరకు ఊరేగింపుగా వెళ్ళి న్యాయ విచారణ జరిపించాలని కోరారు. మళ్ళీ కలెక్టర్ ఆఫీసు ముందు వాళ్ళపై లాఠీచార్జి జరిగింది.

ఆనాడు సాయంత్రం వరంగల్ కళాశాలలకు చెందిన లెక్చరర్లందరూ సమావేశమయి ఒక కార్యాచరణ సంఘాన్ని ఏర్పరచుకున్నారు. కలెక్టర్ ఆఫీసువరకు మౌన ఊరేగింపు తీశారు. కలెక్టర్‌తో చర్చలు సంతృప్తికరంగా లేనందువల్ల లెక్చరర్లు 1-9-79న తరగతులు బహిష్కరించారు.

ఈ సందర్భంగా జరిగిన రెండు సమావేశాల్లో ప్రొఫెసర్ దేశ్‌ముఖ్, ప్రొఫెసరు విజయసారథి మొదలయిన కళాశాలాధ్యాపకులందరూ పాల్గొన్నారు. ప్రొఫెసరు వాసుదేవ్, ప్రొఫెసరు జేమ్స్, డాక్టరు కేశవరావు, రిజిస్ట్రారు శ్రీ జయ్ శంకర్ మొదలయినవారు పోలీసుల లాఠీచార్జీని ఖండిస్తూ మాట్లాడినారు.

వైస్ ఛాన్సలర్ ఈ సంఘటన పట్ల విచారం వ్యక్తం చేసాడు.

వరంగల్ కళాశాలల అధ్యాపకులందరూ సి.ఐ. శ్రీ మంగిశెట్టిని సస్పెండ్ చేసి న్యాయవిచారణ జరపాలని కోరారు. తెలంగాణా అనుబంధ కళాశాలల అధ్యాపకుల సంఘం, ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం, రాడికల్ విద్యార్థి సంఘం, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, జిల్లా శాఖ, విరసం యూనిట్, అన్ని ఉపాధ్యాయుల సంఘాలు, జనతాపార్టీ నాయకులు, విద్యార్థి పరిషత్, విద్యార్థి కార్యాచరణ సమితి మంగిశెట్టిని సస్పెండ్ చేయాలనీ, న్యాయ విచారణ జరపాలనీ కోరాయి.

రచన - భాషపై చర్చ:

## మాండలికం అవసరమే

భారతదేశంలో అక్షరాస్యుల సంఖ్యకు, మాండలికాల్లో రచనలు చదవటానికి ఏమిటి సంబంధం? ఆ ఇరవైమూడు మందిలో ఎంత మంది విప్లవ రచనలను చదువుతున్నారు? విప్లవ రచనలు చదివేవారిలో మాండలీకాలు చదవటం లేదా ఎవరైనా? విప్లవ రచనలు చదివే అభివృద్ధికరమైన పాఠకుల్ని తీసి పక్కనపెట్టండి. విప్లవ రచనలతో పరిచయంలేని వాళ్ళు, మాండలికంతో కనీస సంబంధంలేని వాళ్ళు మధ్య తరగతి పాఠకులు, ఇంకా కొంతమంది అట్టడుగు వర్గ పాఠకులు కూడా రావిశాస్త్రిగారి రత్తాలు - రాంబాబు, బీనాదేవిగారి హేంగ్ మి క్విక్ నవలలు సీరియల్‌గా ఆంధ్రజ్యోతిలో వస్తున్నప్పుడు ఎంత గొప్ప ఆదరణ కనపరిచారు! కోస్తా ప్రాంతానికి పరిచయంలేని కొత్తపదాలు వొగ్గు, తొంగో, అప్పాలాంటి అనేక పదాల్ని ఎంతో ఆనందంగా పేర్కొంటూ పగలబడి నవ్వేవారు. ఇక్కడ మనం గమనించాల్సింది.

పాఠకులు అభివృద్ధి వైపు ముఖం తిప్పారని, కొత్తని ఆహ్వానిస్తున్నారని. రత్తాలు-రాంబాబు నవలకు ఎంత గొప్ప ఆదరణ లభించిందో గమనిస్తే మాండలీకాలు అనవసరం అనే నిర్ణయానికి రాజుగారు రారు. ఆ నవల పుస్తకాలుగా (నాలుగు భాగాలు) వెలువడితే కొన్ని వేల కాపీలు ఎగిరిపోయి మూడో నెలలోనే పునర్ముద్రణకు నోచుకుంది. పాఠకులు మాండలీకాలు అంటే ఆసక్తి కనపరుస్తున్నారని, ఆదరిస్తున్నారని వాటి అమ్మకాలు చెపుతున్నాయి.

భాషకు సంబంధించి పాఠకులకు ఇబ్బంది ఇవ్వకూడదనే విషయం కూడా అర్థ రహితమైనది. పాఠకుల్ని ఏ రచన అయినా ఎప్పుడూ ఆలోచింపచెయ్యాలి. రచన పాఠకులకు కొద్దో, గొప్పో శ్రమ ఇవ్వాలి. అలాగాక అరటికాయ వలిచినట్లు నోట్లో పెడితే ఆ రచనను నిర్లక్ష్యంగా చదివివదిలి పెడతారు. కనుక మాండలీకంలో వ్రాస్తే ఇబ్బంది పడతారని, అలా ఇబ్బంది పడకుండా సాధారణ భాషలో వ్రాయాలని చెప్పటం సరైంది కాదు.

ఇక సినిమాలలోని భాష ప్రజలకందరికీ అర్థం అవుతుందనుకొంటే చాలా పొరబడినట్లే. సినిమాలలోని భాష ప్రజలకందరికీ అర్థం అవుతుందనుకుంటే అంతకంటే మూర్ఖత్వమయిన విషయం ఇంకొకటి లేదు. సినిమాలలో కానీ, నాటకాలలో కానీ జనం కదలకుండా కూర్చుంటే వారికి అవి అర్థమయినట్లుగా భావించకూడదు. ఉదా॥ పౌరాణిక నాటకాలంటే జనం తండోప తండాలుగా పోతారు. (కోస్తా ప్రాంతం వరకే నాకు తెలిసింది) ఆ పౌరాణిక నాటకాలలోని సంస్కృత పదాలు, ఎంతో క్లిష్టమైన అర్థాలతో కూడుకున్న ఆ పద్యాలు అర్థమవుతాయా? వంగపండుగారి పాటలు తెలంగాణా ప్రాంతంలో ఏమంత ఆసక్తిని కలిగించవు అంటే అక్కడి సమస్యలు వేరు కావచ్చు. గద్దర్ తెలంగాణా మాండలీకంతో వ్రాసిన పాటలు ఆంధ్రలో జనంలోకి పోతున్నాయి.

పాఠకుల్ని కొత్త దృక్పథం వైపు నడిపించాలన్నారు. చాలా మంచి విషయం. సాధారణ భాష నుంచి విడివడి మాండలీకంలో వ్రాయటం కూడా ఓ కొత్త దృక్పథమే కదా! పాఠకుల్ని ఆ నూతన దృక్పథం వైపు నడిపిద్దాం. ఏది ఏమైనా మాండలీకాల్ని గూర్చి ఇంకా విస్తృతమైన పరిశోధనలు జరగాల్సిన అవసరమున్నది.

మాండలీకంలో వ్రాసే వాళ్ళని వ్రాయనివ్వండి. దాని ప్రయోజనం దానికుంటుంది. మనం కొత్తని ఆహ్వానిద్దాం.

– మొలకలపల్లి కోటేశ్వరరావు

SRJANA Telugu Monthly Sep. '79 H/WL-10
Regd. No. with Registrar of News Papers 10953/67

# సృజన జీవిత సభ్యులుగా చేరండి- చేర్పించండి

ఇవ్వాటి గురించి ఆలోచిద్దాం-

ఇరవయ్యొకటవ శతాబ్దం గురించి కూడ ఇప్పటి నుంచే ఆలోచిద్దాం.

ఇవ్వాళ సృజనను నిలబెట్టుకుందాం- ఇరవయ్యొకటవ శతాబ్దం సృజనకు ఇప్పుడే ఇంధనం ఏర్పాటు చేద్దాం.

'అరవై ఆరు నుంచి త్రైమాసికగా, ఒక దశాబ్దంగా మాస పత్రికగా ఎమర్జెన్సీ చీకటి రోజుల్లో తప్ప ఎన్నడూ ఆగిపోకుండా వెలువడుతున్న ఒకే ఒక్క- ఆధునిక సాహిత్య వేదిక సృజన.

మీరు సృజనకు చందాదారులుగా చేరారు, చేర్పించారు-
విరాళాలు ఇచ్చారు. మీకు వీలయిన విధంగా తోడ్పడ్డారు.

ప్రజల ఆదరణవల్లనే సృజన నూరవ సంచికకు చేరువవుతున్నది.

నూరు పూలు వెయ్యి కాయలుగా సృజన
నూతన సమాజ పరిమళాలు, ఫలాలు పంచడానికి

## సృజన జీవిత సభ్యులుగా చేరండి.

జీవిత సభ్యత్వం 200 రూపాయలు

ఒకేసారి గానీ, నాలుగు సమాన వాయిదాల్లో ఒక సంవత్సరం లోపున గానీ చెల్లించవచ్చును.

శాశ్వతంగా సృజన మాత్రమే కాదు
మీరు సృజన ప్రచురణలపై 25% కమీషన్ కూడ పొందుతారు.

సృజన జీవిత సభ్యులుగా ఈ రోజే చేరండి, చేర్పించండి.
ప్రజా జీవిత ప్రతిస్పందన సృజన పది కాలాలపాటు చేయూత నివ్వండి.

SRJANA Rs. 1-50
Hanumakonda, Warangal 506001